# ఆడుకునే పసి మొగుడు...!

ఆమె పద్దెనిమిదేళ్ళ యువతి. లేత గులాబి రంగు శరీరం. కాటుక దిద్దిన చారెడేసి కళ్ళు. పౌర్ణమి జాబిల్లి వంటి గుండ్రని మొహం! ఆ మొహంలో అమాయకత్వం నిక్షిప్తమై ఉంది... కానీ ఆ వయసు అమ్మాయిల్లో ఉండవలసిన చురుకుదనం, చలాకీతనం మాత్రం మచ్చుకైనా లేవు ఆమెలో. మౌనంగా, విషాదంగా కూర్చునుంది.

ఆమె ప్రక్కనే పది పదకొండేళ్ళ కుర్రాడు కూర్చుని ఉన్నాడు. నోటికి విరామం ఇవ్వకుండా సదా ఏదో ఒకటి నములుతూనే ఉన్నాడు. చీటికి మాటికి అది కావాలి, ఇది కావాలి అంటూ మారాం చేస్తున్నాడు.

ఆ పసివాడు ఆ అందాలరాశి భర్త...! పెద్దలందరి ఆమోదంతోన్నే, ఆదేశంతోనే ఆమెకు అధినాథుడుగా మారాడా కుర్రవాడు... ఐస్‌క్రీం కోసం మారాం చేసే పసివాడు అతడు.

ఇదెలా సాధ్యం...? ఎంత ఆచారం, సాంప్రదాయం అయినా ఇంత విపరీతం ఉంటుందా?... అది ఎలా జరిగిందో, దాని పరిణామా లెలాంటివో పిస్తో భాషా రచయిత్రి షాజాదీ తన అపూర్వ కథానిక 'బలి'లో గుండెల్ని పిండివేసేలా వర్ణిస్తారు, 'విపుల' మే నెల సంచికలో.

ఈ కథ... ఇటువంటి మరెన్నో భాషల ఆసక్తికరమైన కథలకు వేదిక విపుల. వివిధ భాషల విశిష్ట కథల పఠనానికి ఏకైక సాధనం విపుల.

కథలతోపాటు నవ్వించే కార్టూన్లు, జోకులు, ఆశ్చర్యచకితుల్ని చేసే విచిత్ర విశ్వ విశేషాలు 'విపుల' అదనపు ఆకర్షణలు. నెల నెలా ఒకసారి భూప్రదక్షిణం చేయించే విశ్వకథా విపంచి విపుల. రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో ఆకర్షణీయమైన చిత్రాలు విపుల ప్రత్యేకత.



ప్రతి నెలా
1వ తేదీకి వెలువడే
విశిష్ట కథా వేదిక

**విపుల**

132 పేజీలు
రెండు రూపాయలే!

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క- కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు

OBM/1765 TEL

కేర్‌ఫ్రీ మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునికయువతికి చేదోడు.

కేర్‌ఫ్రీ ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్. ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, కేర్‌ఫ్రీ ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపుకోగలదు, కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క- కేర్‌ఫ్రీ మాత్రమే దిగువ భాగము ప్రక్క-లా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకల పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

కేర్‌ఫ్రీ తో మీరు హాయియైన భావన పొందగలరు, నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉతికి ఆరవేసే ఇబ్బందిలేదు.

కేర్‌ఫ్రీ వాడకానికి తయారుగా వుంటుంది, మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అతి ఆరోగ్యకరమైనదిగూడా.

కేర్‌ఫ్రీ ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిస్తుంది.

Johnson & Johnson

* కేర్‌ఫ్రీ జాన్సన్ & జాన్సన్ యు.ఎస్.ఎ. వారి ట్రేడ్‌మార్క్. © J & J 78.






# బర్నాల్

కాలిన గాయాలకు ప్రత్యేక చికిత్స

BC 5643



# కృష్ణ కుమారి

ప్రమోదకరమైన
ప్రయోజనాత్మక నవల

## సూపర్ స్టార్

వివరాలుత్వరలో...



హస్త ప్రయోగము • నపుంసకత్వము

# సెక్సు హాస్పటల్



దురభ్యాసాలకు
లోనై దాంపత్య
సౌఖ్యం అనుభవించ
లేనివారు వెంటనే
సంప్రతించండి!

**డా॥ A. పూర్ణచంద్రరావు**
(సెక్సు స్పెషలిస్టు) N.D.F.N.F.U (CEYLON) R.A.M.P
గవర్నరుపేట. వ్యాడియం రోడ్. విజయవాడ 2. (A.P)

సుఖవ్యాధులకు ప్రత్యేక చికిత్స

Phone No 63753



లతకు పందిరే
అందం.....
మహిళకు

శ్రీ

22 ct. బంగారు
కవరింగ్
చేయబడినవి

ఆభరణములే
అందం.

TRADE MARK
REGD NO 268735

PHONES:
235, RESI: 785.

nirmala

తయారుచేయువారు:
**శ్రీ గోల్డు కవరింగ్ వర్కు Regd**
P.B.No.35 శ్రీమహల్, మచిలీపట్నం. A.P

✻ మా నెల్లూరు బ్రాంచీలు ✻

1. పట్టాభి మార్కెట్.......మచిలీపట్నం
2. శేషయ్య వీధి.........విజయవాడ-1
3. ట్రంకు రోడ్డు............నెల్లూరు
4. 6 కార్ స్ట్రీట్...........తిరుపతి
5. గాంధీ రోడ్డు...........తిరుపతి
6. సుభాష్ రోడ్డు.........అనంతపురం
7. ఎవెన్యూ రోడ్డు........బెంగుళూరు
8. గాంధీ బజారు.........బెంగుళూరు
9. గాంధీ బజారు...........షిమోగా
10. మునిసిపల్ మార్కెట్......కర్నూలు
11. జయంతి బిల్డింగ్స్.......బెంగుళూరు
12. మద్రాసు రోడ్డు.............కడప
13. రామన్ కోయిల్ స్ట్రీట్.....చిత్తూరు
14. నాగులకుంటరోడ్డు...నంద్యాల
15. గాంధీవిగ్రహంవద్ద - నర్సరావుపేట
16. అమ్మవారిశాలవద్ద, మార్కాపురం

# లిమ్కాతో అనుక్షణం సేదతీరును మరుక్షణం

లిమ్కా, జమైకన్ నిమ్మ మరియు సిసిలియన్ నిమ్మపళ్ల పుల్లని, తియ్యని రుచి. సువాసనల సంగమం. బాక్టీరియా రహిత పానీయం. మీ దాహం తీర్చడానికి దీనిలో 'ఐసోటానిక్' లవణాలున్నాయి. విటమిన్ సి కూడా. కాలరీలు కావాలనుకునేవారు ఇతర పానీయాలకు బదులు లిమ్కానే ఎంచుకుంటారు.

లిమ్కా మీ ఇంటిల్లిపాదినీ రంజింపజేసి అన్ని వేళలా మీ సేదతీర్చే పానీయం—ఇంటా, బయటా కూడా.



**ఈతకొట్టి పైకొచ్చాకా, ఇష్టంతో తాగేది లిమ్కా.**
ఈత కొట్టాక సేదతీర్చే గుటక.



**బాక్సింగ్ పిడులు మెచ్చేది, లిమ్కా వారికి నచ్చేది.**
పోటీ తర్వాత సేదతీర్చే పానీయం.






**సైకిలు తొక్కే సమయం, లిమ్కా పానం రసమయం.**
షికారు తర్వాత సేదతీర్చే పానీయం.



**పిక్నిక్ సరదా కిలకిలలు, లిమ్కా నవ్వుల గలగలలు.**
బయటకు వెళ్లినప్పుడు సేదతీర్చే పానీయం.



**కేంటీన్ కబుర్ల సమయంలో, మెదులును లిమ్కా మదిలో!**
కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ తాగే పానీయం.




RADEUS/PE/L-2-81

## లోకంపోకడ * డిమెన్











**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1906

శివలెంక శంభు ప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 8–5–'81

దుర్మతినామ సం. వైశాఖ శు. పంచమి

**సంపుటము 74 : సంచిక 34**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67–60

ఆరు మాసాల చందా రు. 33–80

విడిప్రతి వెల 1–25 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం. విజయవాడ-520 003


---

## విషయానుక్రమణిక

# సర్వత్ర సమ దర్శనః

పిపీలికాది బ్రహ్మ పర్యంతమూ అన్ని ప్రాణులలోనూ, భగవంతుడు వ్యాపించి వున్నాడని విజ్ఞులు చెప్తున్నారు. అందువల్ల సర్వప్రాణులనూ తమతో సమంగా చూడాలనీ, అన్ని ప్రాణుల్లో భగవంతుడు ఉన్నాడనే సంగతి మరచిపోవద్దనీ వేదాంతులు బోధిస్తారు. అయితే— ఆ విధంగా చూచే వారు కోటికి ఒకరైనా ఉంటారా? అనేదే సందేహం. కాని, అలా చూచేవారున్నూ లేక పోలేదు. దీనికి మహారాష్ట్రంలోని ఏకనాథుడు గొప్ప నిదర్శనం.

ఆయన ఆదర్శ వేదాంతి. ఆయనవల్ల సదుపదేశాలు పొందడానికి ఎందరో ఆయనకు శిష్యులయేవారు. ఆ కాలంలో తీర్థయాత్రలకు ప్రాముఖ్యం ఉండేది, ఇప్పుడు వినోద యాత్రలకు ప్రాముఖ్యం ఉన్నట్లు. వాటివల్ల ఎంతో పుణ్యం లభిస్తుందని మనవారి విశ్వాసం. కాశీలోని పవిత్ర గంగాజలాన్ని తీసుకొనివచ్చి దానితో రామేశ్వరంలోని రామ లింగేశ్వరస్వామికి అభిషేకం చేస్తే ఎంతో పుణ్యం లభిస్తుందని, దానితో జన్మ కృతార్థ మవుతుందనీ గట్టి నమ్మకం వుండేది. ఏకనాథునికిన్నీ అట్టి సంకల్పం కలిగింది. ఆయన కాశీకి పోయి, విశ్వేశ్వర దర్శనం చేసుకొని, పవిత్ర గంగాజలాన్ని ఒక పాత్రలో భద్రపరచి, అక్కడి నుండి రామేశ్వరానికి ప్రయాణమైనారు. ఆయన వెనుక కొందరు శిష్యులు కూడా ఉన్నారు.

ఆ కాలంలో తీర్థయాత్రలు చాలా కష్టం. ఎంత దూరప్రాంతాలకయినా కాలినడకనే పోవాలి. దారిలో ఆహారానికి, నివాసానికి ఎంతగానో శ్రమపడవలసి వస్తుంది. కాశీ నుంచి రామేశ్వరం పోవడం సామాన్య యాత్రికులు చెయ్యగల పని కాదు. అయినా ఏకనాథస్వామి శిష్యులతో కూడా రామేశ్వర యాత్రకు బయలుదేరాడు.

వారు చాలా రోజులు ప్రయాణం చేసి చాలా దూరం వచ్చారు. ఒకనాడు వారు పోతూ ఉన్నదారిలో ఒక గాడిద నేలమీద పడి పొర్లుతూ అతనికి కానవచ్చింది. అది చాలా దప్పికతో మిక్కిలి బాధపడుతున్నట్లు ఏకనాథుడు తెలుసుకున్నాడు. శీఘ్రంగా కొంత నీరు దాని నోట్లో పోస్తేనే దాని

# ధర్మపథం

ప్రాణాలు దక్కుతాయి. ఆ చుట్టుపక్కల ఎక్కడా నీరు ఉన్నట్లు జాడలేదు. అందువల్ల అయన, తాను తెస్తూవున్న గంగాజలాన్ని దాని నోటిలో పోసి, దాని ప్రాణాలు నిలపాలని నిశ్చయించాడు.

అతని నిశ్చయాన్ని గ్రహించి శిష్యులు "స్వామీ! ఇంత దూరం తీసుకువచ్చిన ఈ పవిత్ర గంగాజలాన్ని ఈ గాడిద నోటిలో పొయ్యడమా? ఇక స్వామి అభిషేకానికి గంగాజలం ఎక్కడ?" అని అన్నారు. ఆయన చిరునవ్వు నవ్వుతూ "ఈ గాడిదలో ఉన్నదీ దేవుడే! దీనికి ఆపద వచ్చినప్పుడు రక్షించకుండా— ఈ దేవుణ్ణి అలక్ష్యం చేసి, రామేశ్వరంలోని దేవుడికి అభిషేకం చెయ్యడం ఉచితమని నాకు తోచలేదు. సర్వత్ర భగవంతు డున్నాడని చెప్తూ, దానిని ఆచరణలో పెట్టక ఉపేక్షించడం మేలని నాకుతోచలేదు. ఆ అభిషేకం కంటే, దీని దప్పిక తీర్చడమే ఉత్తమమైన దైవారాధన" అని చెప్తూ, గంగాజలాన్ని దాని నోటిలోపోసి ఆ గార్దభాన్ని రక్షించాడు. (భగవాన్ సత్యసాయీ చిన్న కథ నొక దానిని అనుసరించి.)

— బులుసు వేంకటరమణయ్య


ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకులకు...

పత్రిక ప్రచురణకు అవసరమగు న్యూస్‌ప్రింటుపై ప్రభుత్వం అదనపు పన్ను విధించడంవలనూ, ముద్రణ కవసరమగు యితర ముడివస్తువుల ధరలలో పెరుగుదల చేతనూ **8-5-1981** తేదీ నుండి **ఆంధ్ర సచిత్ర వారపత్రిక** ధర తప్పని సరిగా పెంచవలసి వచ్చినది.

**8-5-1981 నుండి ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**విడిప్రతి వెల 1-25 పైసలు**

**కొత్త రేట్ల ప్రకారం చందా వివరాలు**

| | ఏజెంటుద్వారా రు. పై. | పోస్టుద్వారా రు. పై. |
|---|---|---|
| 3 నెలలకు | 16-25 | 16-90 |
| 6 నెలలకు | 32-50 | 33-80 |
| 1 సంవత్సరం | 65-00 | 67-60 |

పాఠకులు ఎప్పటి మాదిరిగానే తమ పూర్తి సహకారాన్ని అందిస్తారని ఆశిస్తున్నాము.

బిజినెస్ మేనేజరు,
ఆంధ్రసచిత్ర వారపత్రిక.

N.B.: 8-5-81 తేదికి పూర్వపు పోస్టలు చందాల గడువును కొత్త రేట్ల ప్రకారము సవరించబడును.

తెల్లాల్చీ, పైజామా—సర్దుకుంటూ గిరజాల జుట్టు సవరించుకుంటూ, ముక్కుమీద నుంచి ఏ మాత్రం జారిపోని గోల్డ్ ఫ్రేమ్ కళ్లజోడు సర్దుకోవటం హో మేనరిజమ్‌గా, నేను, యింటి వాకిట అడుగు పెట్టాను...వాహనం దిగి!

# దగాపత్ని....

## ఎమ్.డి.సౌజన్య



మా బయటి తలుపుమీద— 'జటాయువు' కథ—నాటక—నవలా రచయిత'— అనే నేమ్ ప్లేట్ మీద— నల్లటి బ్యాక్‌గ్రౌండ్‌లో తెల్ల అక్షరాలు— కారు చీకటిలో కాంతిరేఖలా మెరిసిపోతున్నాయ్!

ముద్దొచ్చే నాపేరు కంటే, 'జటాయువు' అన్న నా కలం పేరంటే, నాకెంతో ఇష్టం!

సైకిలు గంట కొట్టడంతో, నా రాకను గమనించినట్లుంది మా శ్రీమతి— 'వాణి'

"కేరియర్‌తో మధ్యాహ్నం ఆఫీసుకు భోజనం తెప్పించుకున్నారుగా... టిఫిన్ క్యారేజి... ఏది?" అంది.

మాంచి కథ రాద్దామని వారం నుంచి ప్లాటు కుదరక, కుదిరింది నచ్చక, నచ్చింది కాగితంమీద పెట్టలేక నానా గడ్డి గరుస్తున్నాను.

అసలే మూడ్ పోతుందేమోనని బెంగగా ఉన్న నాకు, శ్రీమతి ప్రశ్న యక్షప్రశ్నగా, సమాధానంలేని శేష ప్రశ్నగా తోచింది!

"కేరియర్‌తో భోజనం తెప్పించుకోవట



తమ పిల్లల పౌష్టిక
ఆహారం గురించి తల్లులు బాధపడుతుంటారు
అయితే సుచిత్రకు ఆ చింత లేదు...



"ఎందుకంటే, నేను మాపిల్లలకు రోజూ హార్లిక్స్
ఇస్తాను. హార్లిక్స్ ఇమ్మని డాక్టరు చెప్పినప్పటినుంచి,
ప్రతి రోజూ హార్లిక్స్ త్రాగటం మా పిల్లలకు
అలవాటు చేసాను. హార్లిక్స్ రోజంతా వారిని
ఆరోగ్యంగా, చలాకీగా ఉంచుతుందని నాకు తెలుసు.

**మీ పిల్లలకు మీరు కూడా
హార్లిక్స్ ఇస్తారు. అవును కదూ?"**

Hx-6273 Tel-A

**మంచి
పుష్టికరమైనది**






"హార్లిక్స్ ప్రధాన పుష్టిదాయక పానీయం.
పుష్టిదాయకమైన ఆహార పదార్థాలతో అద్భుతంగా
దాన్ని రూపొందించారు. హార్లిక్స్ ఏళ్ళ తరబడి
నిరంతరంగా సత్ఫలితాలను చూపిస్తోంది. మా కుటుంబ
సభ్యుల ఆరోగ్యం కాపాడేందుకూ, వారు
ఏరోజుకారోజు చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను
మీకు సిఫారసు చేస్తున్నాను."

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్

వేమిటి? ఎవరు తెప్పించారు?... ఎవరు తెచ్చారు?'' అన్నాను కంగారుగా.

''ఎవరో మీ బిల్ సెక్షనుకు కొత్తగా వచ్చాట్ట. పేరు...'అయోమయం' అన్నాడు! అదేం పేరు? అంటూ ఆరాలడిగాను! వాడు లేకలేక కలిగిన సంతానమని, వాడి తల్లి దండ్రులు వాడికి పిచ్చిపేరు పెట్టారట! వాళ్ళమ్మ మాత్రం వాడిని బుజ్జబ్బాయి... బుజ్జబ్బాయి అని...'' అని చెబుతోంది వాణి.

''ఇక, అసలు సంగతి చెప్పు! 'అయోమయం' అని పేరున్న ప్యూను, మా ఆఫీసులో లేడు! టిఫినుతో పాటు భోజనం కూడా పట్టుకెళ్ళాడా! రాస్కెల్! వాడి కెంత ధైర్యం? ఇంతకీ ఏం కూర, ఏం పచ్చడి?'' అడిగాను మధ్యాహ్నం భోజనం లేనందుకు కడుపు మండిపోతుండగా. టిఫిను కూడా పోయిందనే బాధతో యీ కడుపు మంట మరింత ఎక్కువయ్యింది!!

## దగాపడ్డ...

''మీ కిష్టమని గుత్తివంకాయ కూర, మజ్జిగపులుసు, దోస ఆవకాయ పచ్చడి, వడియాలు, గడ్డపెరుగు'' చెబుతోంది మా ఆవిడ నోరూరించేట్టు.

''అబ్బబ్బా!! వర్ణన చాలుగాని ఆపు!! మనిషి ఎలాఉన్నాడు!! రాస్కెల్ పోలీసులకి కంప్లయింట్ యిచ్చి వాడి పని పట్టాలి. వాడిని నా కథలో విలన్‌గా చిత్రించాలి!'' అన్నాను కసిగా.

రచయిత అయినప్పటి నుంచి నన్ను బాధ పెట్టిన వాళ్ళను, ఏడ్పించిన వాళ్ళను, నా కథల్లో పాత్రల్నిచేసి, వాళ్ళను రాచి రంపాన పెట్టి, పీకి పాకాన పెడుతున్నా! మా డిపార్ట్ మెంట్ ఆఫీసరు ఒకసారి, డ్రాఫ్ట్సులో గ్రామరు తప్పులు పట్టుకొని మెమో యిచ్చినందుకు వాడిని, 'గ్రామర్...పిల్లి'అనేకథలో అఖిలాంధ్ర పాఠకుల నవ్వుకు గురిచేశాను! నా రచనా వ్యాసంగం ఒక్కోసారి యిలాంటి అమాం బాపతు పనులకో సాధనంగా ఉపయోగ పడటం నాకెంతో ఆనందంగా, గర్వంగా ఉంటుంది.

''ఆ ప్యూనెలా ఉన్నాడు!?'' మళ్ళీ అడిగాను మా ఆవిణ్ని.

''నల్లగా, ఆరడుగుల ఎత్తు, బిన్నీషర్టూ, ప్యాంటూ, చూపరులను యిట్టే ఆకట్టుకునే మొహం, ఆ మొహం మీద నుంచి జారే ఉంగరాల జుట్టు, చేతికి ఉమేగా వాచి! సైకిలు బెల్లు ఎంతో మధురంగా కొట్టాడు. వంశీమోహనుని మురళీరావంలా అనిపించింది. టిఫినులో భోజనం పెట్టి యివ్వగానే సైకిల్ మీద దూరంగా ఎక్కడికో అనంత తీరాలకు వెళ్ళిపోయాడు!'' చెప్పింది మా ఆవిడ.

వళ్ళు మండిపోయింది నాకు. టిఫిను పోయినందుకు కాదు, నవలలో హీరో ని


★★★ నిష్ప్రయోజనకరమైన ''భ్రమల ప్రపంచం''లో పఠితలను కాసేపు పరిభ్రమింపజేసి, మభ్యపెట్టకుండ — ప్రతివారు జీవితంలో పురోగమించటానికి ఆవశ్యకమైన ఆయుధ సంపత్తిని బహూకరించే

రావి శ్రీమన్నారాయణ, M.A., నవల










★★★ ''యువరాజు'' నవల (అసాధారణమైన ఫాయిల్ గెటప్‌తో, బవుండు ఎడిషన్) ముందు రు. 10/- M.O. చేస్తే, రు. 20/- లకు V.P. గా పంపిస్తాము.

VARALAKSHMI PUBLICATIONS (Phone: 445232), 11-2nd St., Dr. B.N. Reddy Road, T. Nagar, MADRAS-600 017.

రావి శ్రీమన్నారాయణ, M.A., నిజమైన మాస్టర్ పీస్ "యువరాజు"

ర్శించినట్టు వర్ణించి చెబుతుంటే! ఆ దొంగ వెధవను, నవలా ఫక్కీలో అభివర్ణించటమూ, అనుకుని—

"అబ్బబ్బా ! వాడి పేరేంచెప్పాడు ? నన్ను గురించి, మా సెక్షన్ గురించి ఏంచెప్పాడు!? ఆ టిఫిను ఆ దొంగ చేతికిద్దామని నీకు నమ్మకం కలగటానికి, ఏం చెప్పాడు ? ఆ వివరాలు చెప్పు ?" అన్నాను విసుగ్గా.

"బిల్ సెక్షన్‌లో పనిచేసే 'జటాయువు' పంపారమ్మా ! ఉదయం భోజనం చేయలేదట అయ్యగారు. టిఫిన్‌తో భోజనం తెమ్మన్నారు! నన్ను మీ రెరుగరు సెక్షనుకు కొత్తగా వచ్చాను. నా పేరు 'అయోమయం!' అయ్య గారి సెక్షనులో పనిచేసే రామనాథయ్యగారింట నుంచీ టిఫిను తెస్తున్నా!" అని రామనాథయ్య గారి క్యారియర్ చూపాడు. ఇక నమ్మక తప్పలేదు!" అంది వాణి.

"అయితే వాడు... నా కలం పేరూ తెలుసుకునే యింటికి వచ్చాడన్న మాట... ఐ సీ...!!" అన్నాను పైకి కోపంగా. కాని లోలోపల ఒక దొంగ వెధవకు నా కలం పేరు 'జటాయువు' అని తెలియటం నిజంగా వింత విచిత్రం!! అనిపించింది.

"అయినా వాణీ ! ఎవడో కొత్త వెధవ గదా? వాణ్ణి, వాడి మాటల తీరుని కాస్త విశ్లేషించి, తర్కించి వాడి శైలి, భాష, అర్థం చేసుకుని విమర్శనాత్మక దృష్టితో వాడొకవేళ దొంగేనేమోనన్న అనుమానం రాలేదా !?" అని చివాట్లు వేశాను.

ఇంతలో మా ఆవిడను ఒక కథకు పాత్రను చేసి, ఆమె తెలివి తక్కువతనాన్ని హైలైట్ చేస్తూ, లైట్ హ్యూమర్ వీన్‌లో ఒక కథ వ్రాసి, ఆడంగుల్ని జాగర్తగా వుండమని హెచ్చరిస్తూ విడ్యుకేట్ చేసే కథ వ్రాస్తే ఉభయతారకంగా కొంత పేరు, కొంతడబ్బు!! నైస్ అయిడియా అనుకున్నాను.

"కొత్త ప్లాట్ దొరికింది. పోతేపోయింది టిఫిను!!" అనిపించింది.

మనిషి ఎందుకు మోసపోతాడు?

మోసగింపబడే వాడికంటే, మోసం చేసే వాడు తెలివిగలవాడైతే...!!

మోసం జరుగుతున్నట్టు, మోసంజరుగు తున్నంత సేపూ తెలియకుండా వుండే ఒక విధమైన తెరదించినట్టు అంతా డ్రమెటిక్‌గా జరిగిపోవాలి! మోసం చేసేవాడికి తానెన్ను కున్న విక్టిమ్...ఏ అవసరమో, బలహీనతో అసహాయతో ఆలంబన కావాలి!! సమయం కనిపెట్టి మెత్తగా దొంగ యింటికి కన్నం వేసినట్టు... ఆ వీక్ పాయింట్‌ని... ఆ వీక్ మొమెంటులో ఎక్స్ ప్లాయిట్ చేయాలి! దిక్కుమాలిన ఫార్ములా!! అయినా విక్టిమ్ తెలివిగలవాడైతే ఆ ఫార్ములా పప్పులు ఉడకవు గదా!?" విమర్శించుకున్నాను!

ఇంతలో "బాబా బాబా బ్లాక్ షీప్... హ్యావ్ యూ ఎనీ ఊల్!" అంటూ పాడు కుంటూ ఇంట్లోకి ప్రవేశించాడు మా తిక్కన !! మా వంశాంకురం !!

కథారచయితగా సాహిత్యపు వాసనలు వెదజల్లాలని, అచ్చతెలుగు మడికారపు యింపు సొంపులమీద ప్రేమతో, మా వాడికి 'తిక్కన' అని పేరుపెట్టి, ఇంగ్లీషు మీడియమ్ స్కూల్లో చేర్చా ! ఖర్మ ! ఈ మధ్య తెలుగు లోనూ సున్నా మార్కులు సంపాదిస్తున్నాడు!

"ఏదిరా సైకిల్ లోపలికి తేలేదేం !?" అన్నాను యింగ్లీషులో.

మా తిక్కన చదివే 'ఆల్ సెయింట్స్'లో విధిగా యింగ్లీషులో మాట్లాడాలట.అందుకని మా వాడు స్కూలు వదలినా యింగ్లీషులో మాట్లాడతాడు! అనర్గళంగా, ధారాళంగా, క్రియలేకుండా మాట్లాడతాడు.

వేనడిగిన 'సైకిల్' సంగతిలో ధ్వనించిన తీవ్రత అర్థం చేసుకున్నట్టున్నాడు. హిచ్‌కాక్ చిత్రంలో భయంకర దృశ్యాన్ని చూసినట్టు చూస్తూ నాతో—

"అదేమిటి డాడీ! మీరు మా 'ఆల్ సెయింట్స్' కాన్వెంట్ ప్రిన్సిపాల్‌కు ఫోనుచేసి, సైకిల్ రిపేరు చేయించటానికి మనిషిని పంపుతామని పంపారుగా" అన్నాడు.

నా తల గిర్రున తిరిగింది.

"కొంపతీసి, యివ్వాళ ఏప్రిల్ ఫస్ట్ కాదు గదా ?" అనిపించింది, ప్రథమాలోచనలో.

కాంపిటీషనులో ప్రథమ బహుమతి వస్తుందనుకున్న కథ- సాధారణ ప్రచురణకు కూడా నోచుకోక తిరిగి వచ్చినప్పటి కంటే కోటిరెట్లు అధికమైన బాధది.

"నేను మీ కాన్వెంట్‌కి ఫోనుచేసి సైకిల్ రిపేరు సంగతిచెప్పి మనిషిని పంపుతున్నాను. నీ సైకిల్ పంపమన్నానా ?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఔను డాడీ, ఇంటర్‌వల్‌కు ముందు, మా ప్రిన్సిపాల్‌గారికి మీ దగ్గరనుంచి ఫోనొచ్చింది. నేను క్లాసులో వుంటే ఆయనే పిలిపించారు. మీరేగా నాతో మాట్లాడి, సైకిల్ వెంటనే పంపు. మనిషిని పంపు తున్నాను. ఇతను మా డిపార్ట్‌మెంట్ కొత్త ప్యూను. మనింటి నుంచి నాకోసం టిఫిన్ క్యారేజి తెస్తున్నాడు. అది తెచ్చిన మనిషికి నీ సైకిల్ యిచ్చిపంపు! అంటూ చెప్పారు." అన్నాడు మా తిక్కన.

"అయితే ఇక్కడ టిఫిను భోజనంతోసహా కాజేసి, అది చూపటానికి వాడుకాని... అను మానం రాకుండా ఉండేందుకు నేను ఫోను చేసినట్లు ఫోనుచేసి నా గొంతు అనుకరించి, ప్రిన్సిపాల్‌తో మాట్లాడి... మై గాడ్ !...






ఆ దొంగ వెధవకు నా కలం పేరు తెలుసు. మా తిక్కన 'ఆల్ సెయింట్స్'లో చదువుతున్న విషయం, నేను పనిచేస్తున్న సెక్షను, మా వాడికి సైకిలుందని, అది రిపేరు చేయించవలసిన అవసరం వున్న సంగతి... ఏన్ని వివరాలు తెలుసు!? మోసం చేయటానికి ఏన్ని వివరాలు తెలుసుకున్నాడు! పైగా ఇక్కడ మా వాణిని మోసం చేసి, టిఫిను భోజనంతో సహా కాజేసి, ఆ టిఫిను క్యారేజిని చూపి మా తిక్కనను నమ్మించటానికి ప్రయత్నించాడు!" అంటూ జరిగిన మోసాన్ని విశ్లేషిస్తున్నాను.

మా తిక్కన తల వంచుకొని నిలబడ్డాడు, మోసం జరిగిందని తెలుసుకోగానే!

వాణ్ణలా చూస్తుంటే ఓ ప్రక్క తిక్క రేగుతోంది. మరో ప్రక్క జాలివేస్తోంది!!

"ఏరా! ప్యూను మీ కాన్వెంట్ ప్రిన్సిపాల్‌తో నీతో తెలుగులో మాట్లాడాడా ఇంగ్లీషులో మాట్లాడాడా!?" అడిగాను ఏదో 'క్లూ' దొరికినట్లు.

"తెలుగులోనే మాట్లాడాడు!" చెప్పాడు తిక్కన.

"ప్యూను ఇంగ్లీషులో మాట్లాడుతాడా!? పైగా తెలివిగా దొంగతనం చేయటానికి వచ్చినవాడు!" అనుకున్నాను.

"వాణి... టిఫిన్ కేరియర్!! తిక్కన... ఏకంగా సైకిలు...!! ఛీ! ఛీ! ఎలా బ్రతుకుతార్రా ఈ లోకంలో. ఇద్దరూ కట్టకట్టుకొని మూసీనదిలోకి దిగండి!" అందామనుకున్నాను.

ఆ నదిలో ఎప్పుడూ నీళ్ళుండవన్న సంగతి గుర్తొచ్చింది.

"అఘోరించావుగాని, ఆ ప్రక్క వీధేగా ఇన్‌స్పెక్టరు ఆనందరావుగారిది. ఆయన ఇంట్లో వున్నారేమో చూసిరా. పోలీసు

# దగా పడ్డ...

కంప్లయింట్ యిద్దాం!" అన్నాను పైకి.

తిక్కన అక్కడి నుంచి వెంటనే నిష్క్రమించాడు. ఇక మా వాణి ఎదురుగా ఉంది.

"అయినా...వాణీ! అణుయుగంలో వుండే మనిషి తన చుట్టూ వుండే పరిసరాల్ని, మనుష్యుల్ని... వాళ్ళ య్రప్రోచ్ కాగానే వాళ్ళ మనోగత భావాల్ని వాళ్ళ మాటల, చేష్టల వెనక వుండే అంతర్యాన్ని, ఆలోచనా ధోరణిని సిక్స్‌త్ సెన్స్ ఉపయోగించి కనిపెట్టాలి!" అంటూ గీతోపదేశం చేస్తున్నాను.

ఇంతలో "నమస్తే సార్!" అన్న తియ్యటి కంఠం విని, వాగ్ధోరణిని ఆపాను.

ఎదురుగా ఎర్రగా గుండ్రటి మొహం, సన్నటి నాసిక, విశాలమైన కళ్ళు, వంకు వంకుల కురులు, భుజంమీద నుంచి పడగ విప్పిన పాములా జారినట్లు మెరుస్తోంది జడ! కళ్ళజోడు పెట్టుకోవటంవలన అనుకుంటా, ముఖంలో గంభీరత, పెండుతనం కనిపిస్తున్నాయి. అందమైన రంగుల బాపు బొమ్మ!

"అయామ్ ఫ్రమ్ తిరుపతి. అయిమీన్ వెంకటేశ్వర యూనివర్సిటీలో రిసెర్చ్ స్కాలర్‌ని. తెలుగు కథానికలో సామాజిక స్పృహ,అనే విషయంమీద రిసెర్చిచేస్తున్నాను. ప్రముఖ కథ, నవల, నాటక రచయిత 'జటాయువు' మీరేకద సార్!" అంది.

ఎంతో తియ్యగా అడిగింది. ఆ గొంతులో కోటిరాగాలు. నిజంగా సరస్వతీ సాక్షాత్కారం అయిందా అనిపించింది.

"ప్లీజ్ కూర్చోండి!" అన్నాను, అంత వరకూ ఆమాట అనవందుకు నొచ్చుకుంటూ.

"వివరి వండుకోతి!" అన్నట్టు కొర కొర చూపుతో మా ఆవిడ జెలసీగా చూసి వెళ్ళిపోయి—

"వాణి! రెండు బ్రూకాఫీ...అర్జంట్!" అన్నాను ఆవిడను లోపలికి పంపుతూ.

"నా పేరు శారద! నా రిసెర్చ్ మెటీరియల్‌లో ప్రముఖ ఆధునిక రచయితల్లో ప్రముఖుల పేర్లన్నీ కాకుండా, వాళ్ళల్లో తల మానికంగా ఎన్నుకోదగినవాళ్ళ పేర్లు మాత్రమే తెలుసుకొని,వాళ్ళను యింటర్వ్యూ చేస్తున్నాను పర్సనల్‌గా! మీ పేరు మా ప్రొఫెసర్ గారే చెప్పారు. మీ రచనల్లో ఉండే సామాజిక స్పృహను గురించి ఆ మధ్య ఒక లెక్చర్ యిస్తూ వివరించారు. ఈమధ్య మీ 'సిక్స్‌త్ సెన్స్' అనే కథ ఎంతో బాగుంది! ఆ...బైదిబై... మీ కథల కటింగ్స్ వుంటే యివ్వండి ఏమైనా, ఎన్నయినా పర్వాలేదు నాలుగయిదు వారాల్లో రిజిష్టర్‌పోష్టులో పంపుతాను! ఆ... ఇక యింటర్వ్యూ! మీ కథలకు ప్రేరణ... ఐ ... మీన్, మీకు కథలెందుకు ... ఎలా వ్రాయాలనిపించింది?" గడగడా అడిగేసింది, చదువుల సరస్వతి.

"పాత మేగజైన్స్- రష్యన్, జర్మన్, ఫ్రెంచ్, ఇంగ్లీషు కథలు ... నా కథలకు మూలం" అని చెప్పమని నా అంతరాత్మ ఘోషిస్తోంది.

కాని యింత ఘోరమైన నిజం ఎలా చెప్పగలను? పైగా... వీకర్ సెక్స్ ... యంగ్ ... ఛార్మింగ్ వుమన్‌తో! మొహమాటం, అంతకంటే ఆత్మగౌరవం అడ్డొచ్చి!

"మా పూర్వీకుల్లో చాలామంది ఆశు కవిత్వంతోపాటు అష్టావధాన, శతావధానాలు చేసిన వాళ్ళే! అలా కవి పండిత వంశంలో పుట్టినవాణ్ణి కావటం ఒక కారణం అనుకుంటాను!" అన్నాను.

మా పూర్వీకుల పేర్లేమయినా కొంపతీసి వాకబు చేయదు కదా!? అనే భయం ఓ ప్రక్క నా మనసులో పిచ్చి గుర్రంలా పీకుతోంది.

"మీ కథలకు వస్తువునెలా స్వీకరిస్తారు?" అడిగింది శారద.

"నిత్య జీవితంలో చూసినవి, నన్ను బాగా కదిలించినవి, నా మనో ఫలకంమీద బాగా ముద్ర వేసినవి, ఇక అవి వ్రాయకపోతే బతకలేను అనే భావోద్రేకం కలిగినపుడే నేను కాగితాలమీద కూర్చుంటాను" అన్నాను.

చదువుల సరస్వతి నే చెప్పిన వివరాలన్నీ

పిల్లల్లో ఆరోగ్యం ఉబికే ఉత్సాహం పొంగులు వారుతూంటే సరి



వాళ్ళు చేసే అల్లరికూడాయిక ముచ్చటగానే ఉంటుంది మరి.

మాల్టోవా తాగే పిల్లల్లో అసలు ఎంత చురుకూ, ఉత్సాహం ఉంటుందంటే, దూరం నుంచే చూసీ చూడంగానే టక్కున గుర్తు పట్టెయ్యొచ్చు, వాళ్ళు 'మాల్టోవా పిల్ల'లని. వాళ్ళు జీవితంలోని ఏ రంగంలోనైనాసరే అందరికన్నా ఒక మెట్టు పైనే ఉంటారిక.

మరి మాల్టోవా ఎంతో రుచికరమైనది కూడాను. రుచిగా ఉండటమేగాకుండా అత్యంత పుష్టికరమైనది కూడాను. ప్రోటీన్, వైటమిన్లూ, ఖనిజ పదార్థాలతో సమృద్ధి అయినది యిది. దాంతో మీ పిల్లల శరీరం సరియైన తీరులో పెరుగుతుంది. వాళ్ళని ఆరోగ్యంగా ఉంచుతుంది. మాల్టోవాతో పిల్లల జీవితంలో ఎంత ఉత్సాహం పొంగులు వారుతుందంటే, వాళ్ళని అలా చూస్తూనే మీ రిక సగర్వంగా సంతోషిస్తారు.




అత్యంత వైటమినులతో

# మాల్టోవా

ఆరోగ్యం, బలం మరియు శక్తి కోసం.



ASP/JIL/2315-81 Tel

JIL జగత్‌జీత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్

షార్ట్‌హాండ్‌కంటే వేగంగానే లాంగ్‌హాండ్‌లో వ్రాసుకుంటోంది!

"ఏఏ రచయితలంటే, ఏఏ రచనలంటే మీకెక్కువ యిష్టం?" మళ్ళీ ప్రశ్న.

"సామాజిక దృక్పథం, వ్యక్తి వికాసం, మానవతా వాదం, వ్యక్తి స్వాతంత్ర్యం కోరే రచయిత లందరూ నాకిష్టులే! రష్యన్ టాల్‌స్టాయ్', 'చెహోవ్', 'గోర్కీ', ఫ్రెంచ్ 'మపాసా', 'ఇబ్సన్', 'ఎమిలీజోలా', అమెరికా 'ఓ హెన్రీ', 'టెనిగీ విలియమ్స్', 'ఎమ్‌ర్సన్' 'థోరో' ఇంగ్లీషు 'సోమర్ సెట్ మామ్' 'కిప్లింగ్' 'హార్డీ' పాతరచయితల్లో, 'ప్లాటో' 'అరిస్టాటిల్' ఆధునిక తత్త్వవేత్తల్లో 'బెట్రాండ్ రస్సెల్' 'ఆర్థర్ ఎవిల్లర్' 'కారల్ మార్క్స్' 'లెనిన్' ఇలా చాలామంది ఉన్నారు" అన్నాను.

నిజానికి వీళ్ళను గురించి వినటమేగాని వీళ్ళ రచనలు నేను చదివిందేలేదు! అసలు నేను చెప్పినట్లు వాళ్ళు ఆయా దేశాలవాళ్ళు అవునో కాదో భగవంతుడికే తెలియాలి!!

ఇంతలో మా వాణి రెండు బ్రూ కాఫీ కప్పులు తెచ్చిపెట్టింది.

"వాణీ! వీరికి నా కథల కటింగ్స్ ఉండే రెండు ఫైళ్ళు తెచ్చిపెట్టు!! శారదగారూ! ఈమె నా బెటర్ హాఫ్!" అన్నాను చిరు పరిచయంతో ముగించి.

మా ఆవిడ మళ్ళీ నిష్క్రమించగానే... ఇంటర్‌వ్యూ మళ్ళీ సాగింది.

"కమిటెడ్ రైటింగ్...ఇజమ్స్...మెలో డ్రామ్... థర్డ్ వరల్డ్... అనేవాటి మీద మీ అభిప్రాయం" అడిగింది శారద.

పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టు బాధపడ్డాను. అయినా నా అజ్ఞానాన్ని తెలియనివ్వకుండా ఓ చిరునవ్వుతో "అంత పెద్ద విషయాలు చర్చించలేను! ఏదోచిన్నవాణ్ణి!" అన్నాను చిరునవ్వుతో నా బలహీనతని కప్పిపుచ్చుకుంటూ.

నేను చెప్పిన ప్రతిమాటా వేదంలా వ్రాసుకుంది శారద. నాకెందుకో బ్రహ్మానందంగా ఉంది.

"సార్ ఓ చిన్న రిక్వెస్ట్! ప్లీజ్ కాదనకండి! నేనే స్వయంగా 'ఆంధ్రుల అభిమాన రచయిత(త్రు)లు' అనే పుస్తకం ప్రచురిస్తున్నాను. అందులో మీ ఫొటో వేయటానికి ఒకకాపీ దయచేయండి!" అంది.

కథలు వ్రాయటం మొదలు పెట్టిన నాగాయితు- రెండు కాపీలు ప్యాస్‌పోర్టు సైజు ఫోటోలు నా పాకెట్‌లో ఎప్పుడూ రెడీగానే ఉంటాయి! ఏమైనా బహుమతులొస్తే... అవసరంకదా! వినయంగా సమర్పించుకున్నాను.

"ఇక సెలవు తీసుకుంటాను! బైదిబై ...పూర్వ ప్రచురణ ధరకింద, పుస్తకం పది రూపాయలు చొప్పున ... పది రశీదులున్న పుస్తకం ఒకటిస్తాను! నేను పుస్తకాలు పది పంపగానే మీరు డబ్బు డ్రాఫ్ట్ పంపండి!" అంది శారద.

ఇంతలో మా ఆవిడ కథల కటింగ్సున్న ఫైళ్ళు రెండుతెచ్చి అందించింది.

"మీరింత సాహిత్యసేవ చేస్తుంటే ... ఒకటేం భాగ్యం! నాలుగివ్వండి! ప్లీజ్ ... డబ్బు కూడా తీసికెళ్ళండి!" అంటూ నాలుగు పచ్చనోట్లందించాను.

"ఇలాటి సహృదయులు – సాహితీ బాంధవులు...నిజంగా అరుదు. థాంక్యూసార్ ... వస్తాను! మీ కథలు వీలైనంత త్వరలో రిజిష్టర్ పోస్టులో పంపుతాను! ఇదిగో నా విజిటింగ్ కార్డు మీద నా అడ్రసుంది నమస్తే!" అంటూ నిష్క్రమించింది. నా మనస్సు బాధగా మూలిగింది.

ఏదో తియ్యటి రంగుల కల చెదిరినట్లు, వరమివ్వబోయే వేల్పు మాయ మయినట్టు అనుభూతి కలగింది.

ఇంతలో మా తిక్కన వచ్చి "డాడీ!" అంటేకాని నేను, ఆ సుషుప్త జగత్తునుండి తిరిగి యీ వాస్తవ జగత్తులోకి రాలేక పోయాను. అయినా వాడి మాట వినిపించదే!

అఖిలాంధ్ర రచయితల్లో అగ్రగణ్య శ్రేణికి చెందిన రచయితలుగా నా పేరు ... రిసెర్చి స్కాలర్సు వ్రాసే థీసెస్‌లో మైగాడ్! — అనుకున్నాను ఆనందంగా ఊహించుకుంటూ.

టిఫిన్– సైకిలు పోయిన సంగతి మరచే పోయాను అలా ఎంతసేపు కూర్చొన్నానో! ఈవినింగ్ ఎడిషన్ పేపర్ కిటికీలోనుంచి నా ముందు పడితే తెరిచి చూశాను! ఓవార్త ప్రథమ పేజీలోనే ఉంది ఫొటోతోసహా! అదిరిపడ్డాను– "రిసెర్చి స్కాలర్ నంటూ రచయితల్ని రచయిత్రుల్ని మోసగించి డబ్బు కాజేస్తున్న యువతి!" అనే శీర్షిక అది.

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥

# డెట్ బిళ్ల వాడండి, తెలుపును పొందండి

ఇపుడు ముందుకంటె
ఎంతో ఎక్కువ మంది
డెట్ బిళ్ల యొక్క
ఉజ్వలమైన ఉతుకును
ఇష్టపడుతున్నారు;
వారంటారు,
ఇది మిరమిట్ల తెలుపును.
ఎంతో ఎక్కువగా
పొదుపును ఇస్తుంది.




# డెట్ బిళ్ల

Shilpi-DM-41 A/80 Tel.

సంతానము, గర్భాశయవ్యాధులు, పరిణామశాలలు
సెక్స్ అంతరంగిక సమస్యలు, మొలలు, చర్మవ్యాధులకు
అనుభవ చికిత్స
పోస్టుద్వారా చికిత్సకలదు
డా॥ యస్. సరోజినీదేవి
(సెక్స్ & గైనకాలజిస్ట్)
డా॥ వి. మధు (సెక్స్ స్పెషలిస్ట్)

సరోజ నర్సింగ్ హోమ్
కొత్తపేట చౌక్, విజయవాడ-520001.
బ్రాంచిలు: జిన్నాటవర్, శీలంవారివీథి, గుంటూరు-1
మారీస్‌పేట, చెంచురామయ్య హైస్కూలు ఎదుట, తెనాలి.

ప్రసిద్ధ వాచ్ కంపెనీకి ఆంధ్రాలో

సేల్స్‌మన్ కావలెను

నెలసరి ఆదాయము కమిషన్ లేదా జీతము ద్వారా సుమారు 550/- లకు పూచీ గలదు. రు. 150/- లు పెట్టుబడిగలవారు స్వంత చిరునామా వ్రాసిన కవరును పంపండి.

ADVERTISER A-4)
P. Box. 9441, DELHI-51.

పవిత్ర రుద్రాక్ష

1 నుండి 14 ముఖములుగల పవిత్ర రుద్రాక్షలు, చందనం, తులసి, పసుపుపచ్చ మరియు గులాబిరంగుల జపమాలలు, శిలాజిత్తు, గోరోచనం, దక్షిణావర్తశంఖము, అదృష్టమును కల్గించే శ్రేష్ఠమైన రాళ్ళు, లభించును. కోరినవారికి ధరలపట్టి పంపబడును. హిందీ లేక ఇంగ్లీషులో వ్రాయండి.

Shree Jagdamba Bhawan
(A.M.) SONEPAT.131001.

ప్రఖ్యాతి చెందిన!
ఖటావ్ మిల్లు వారి
★ 100% పాలియస్టర్ చీరలు..
★ ఫుల్‌వాయిల్, ఆఫ్ వాయిల్ చీరలు
★ షర్టింగులు, గ్లాసుకో ధోవతులు
★ డ్రస్ మెటీరియల్సు, 2x2 రూబియాలాన్సు
★ స్కూలు యూని ఫారంలు ..... వగైరాలకు

విజయ షోరూమ్
ప్రత్యేక ఖటావ్ మిల్లు వస్త్రముల షోరూమ్
J.D. హాస్పటల్ రోడ్డు,
గవర్నరుపేట ......... విజయవాడ-2.

# వారఫలం

## 8-5-1981 శుక్రవారం మొదలు 14-5-1981 గురువారం వరకు

మేషం : ఆశలు ఫలితానికి రాగల వారం. అవకాశాలు అనంతంగా చిక్కగల వారం. అప్రయత్న ధనలబ్ధి, క్రీడారంగంలో అవకాశాలు లభించటం, రాజకీయంగా సర్వానుకూలత చేకూరటం వారఫలం. స్త్రీలకు : సాహిత్య కళారంగాలలో అవకాశాలు, బంధుప్రీతి, ఇత్యాది సుగుణములు కనిపించగలవు.

వృషభం : ప్రయత్నాలు ఫలిస్తాయి. సమయానికి ధనం చేతికందుతుంది. ఒకానొక ముఖ్య సమస్య భూసంబంధమైనది పరిష్కారమయ్యే మార్గం కనిపిస్తుంది. దూర ప్రయాణం కూడా చేయవలసి రావచ్చు. స్త్రీలకు : ఉద్యోగావకాశాలు లంభిచటమేగాక, అనేక నూతన విషయాలు తెలిసికోవటం కూడా జరుగుతుంది.

మిథునం : ఆలోచనలు ఫలితానికి రావు. చిక్కిన అవకాశాలు కూడా జారిపోయే మార్గమున్నది. బంధువులతో ఘర్షణకు దిగవలసిన వారంకూడ. చుట్టు ప్రక్కల వారి గొడవలు, ఇల్లు వృద్ధిచేసే ప్రయత్నాలు ఫలింపక పోవటం గమనించగలరు. స్త్రీలకు ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తవి. ఆదాయమున్నది.

కర్కాటకం : క్రీడారంగంలో, సాహిత్య రంగంలో వైద్యవృత్తిలో, కంట్రాక్టు వ్యాపారంలో కూడి రాగలవారం. శుభకార్య విషయంగా ప్రయాణించవలసిన అవసరం కూడా ఏర్పడగల వారం. ఏదైనా అపరిష్కృత వ్యవహారం, గృహ సంబంధమైనది, ఉంటే అనుకూలదాయకమయ్యే వారం. స్త్రీలకు : ఉద్యోగ వృత్తులందు అనుకూలత, క్రీడారంగంలో అనుకూలత సంభవం.

సింహం : వ్యవహార రంగంలో, వ్యాపార రంగంలో, రాజకీయరంగంలో చేయి తిరిగిన వారికి సర్వానుకూలత ఏర్పడగల వారం. దాయాదుల మూలాన ఏవో ఇబ్బందులు ఎదురుగానున్నవి, పెద్దల ఆదరణం, అనుభూతి, ఆప్యాయతను పంచుకోగల వారం. స్త్రీలకు : కొందరకు విదేశ ప్రయాణానుకూలత ఏర్పడుట, కొందరకు రాజకీయంగా చేకూరగలదు.

కన్య : ముఖ్య బంధువులతోనో, ఆప్తులతోనో, అధికారులతోనో ఘర్షణ సంభవం కావచ్చు. అశాంతికి ఆకరణమైన వారం. అనవసర ప్రస్తావనలకు ఎంత దూరంగా ఉంటే అంత మంచిది. రాశిస్థిత గ్రహాల మూలాన ఇబ్బందులుండగలవు. స్త్రీలకు : సొంతవారి నుండి కొన్ని ఇబ్బందుల నెదుర్కొనవలసి రావచ్చు. క్రీడారంగంలో కొందరకు మాత్రం అనుకూలత ఏర్పడగలదు.

తుల : భారీ వ్యాపారంలో, జాయింటు వ్యాపారంలో నష్టం, కష్టం సంభవించ గల వారం వ్యాపారంలోగాని, క్రయ విక్రయాదులతో ఇబ్బంది సంభవం. జాగ్రత్తగా ఉండటం న్యాయం. వ్యయభావం కూడా చెప్పదగిన దినాలు మొదటి మూడు దినాలుగా గ్రహించండి. సంఘ సేవాపరాయణత్వంలో మాత్రం పేరు తెచ్చుకోగలరు. స్త్రీలకు : విద్యా వైజ్ఞానిక రంగాలలో చాలమందికి లాభించేవారం.

వృశ్చికం : ధనాదాయమున్నది. వ్యాపార లాభమున్నది. కోర్టు కచ్చేరి వ్యవహారాలుంటే విజయమున్నది. సొంత వ్యాపారానికి చాల మంది ఉవ్విళ్ళూరుట సంభవం. కులపెద్దలతోనో, అధికారులతోనో, మిత్రులతోనో, కీచులాట రావచ్చు. స్త్రీలకు : నూతన వ్యాపారానుకూలత, దూరప్రయాణాలోచనలు ఫలించుటకు అనుకూల వారం.

ధనస్సు : విద్యా యోగ్యతకు, విదేశప్రయాణమునకు, ఉత్తరాలమూలాన శుభకార్య నిర్వహణాన్ని గూర్చిన అంశములు తెలిసికొనుటకు, పరాయివారి యనుభూతిని పొందుటకు, చిత్రరంగ వ్యాపారం చేసే వారయితే లాభించి మార్గానికిఅనుకూలత చేకూర్పగల వారం. స్త్రీలకు : బంధు విరోధం, క్రీడారంగంలో లభించిన అవకాశాలు జారిపోవటం, రాజకీయంగా అనుకూలత లేక పోవుట గ్రహింపగలరు.

మకరం : కృషిచేయండి, అనేక విధాల మేలు చేకూరుటకు అనువైన వారం. సాధించ లేక వదలిన కార్యాలయందు మరల అనుకూలత సంభవింపగలవారం. చాల దినాలుగామాటా మంచీ లేక విడివడిన మిత్రులు మరలా కలిసికొనుటకు అనుకూలవారం. స్త్రీలకు : క్రీడారంగంలో అవకాశాలుండుట, కొందరకు రాజకీయ సంబంధమైన చర్చలుండుట, సంఘసేవాపరాయణత సిద్ధించుటకు అనుకూల వారం.

కుంభం : మంచి మనసుతో, నిబ్బరంగా, పట్టుదలతో మీరు గావించిన ప్రయత్నాలు ఫలవంతం కాలవు. బంధువుల మూలాననో, మిత్రుల వలననో, కొన్ని కార్యాలు మీరు సాధించుకోలరు. రచనా వ్యాసంగం ఫలవంతం కావటం కూడా గమనించగలరు. స్త్రీలకు : ఆదాయం, అప్రయత్న ధనలబ్ధి, కార్యానుకూలత సంభవం.

మీనం : మీరు ఒకానొక విషయమై చేసిన ప్రయత్నాలు, వ్యర్థమైనవని బెంగపడవద్దు. ఈ వారంలో కార్యవిజయం సాధించుటేగాక, క్రీడావనిలో అవకాశాలు అందుకొనుటయేగాక, రాజకీయంగా మీకు అనుకూలత చేకూరగలదు. స్త్రీలకు : బంధువర్గీయుల మూలాన లాభించే వారం. నూతనోద్యోగాలు కొందరకు ఈ వారం లభింపనున్నవి. గ్రహించండి, కృషి చేయండి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# అద్భుతమైన అమర్ చిత్రకథలు - మీ పిల్లల కోసం!

పిల్లలకు వినోదాన్ని వికాసాన్ని కలుగజేసే మంచి నేస్తాలు అమర్ చిత్రకథ బొమ్మల పుస్తకాలు. . వాటిని నేడే వారిచేత చదివించండి మన సంస్కృతీ సంప్రదాయాల పట్ల వారికి ఆసక్తి కలిగించండి. రంగు రంగుల ఈ బొమ్మల కథల ద్వారా మన దేశపు పురాణాల గురించీ చరిత్ర కెక్కిన అమర వీరుల గురించీ, మరెందరో జాతి రత్నాల గురించీ వారు ఆడుతూ పాడుతూ తెలుసుకోడానికి తోడ్పడండి కాల వాహినిలో కలిసిపోయిన జానపద కథాలహరిని వెలికి తెచ్చి పిల్లలకు చేరువగా తీసుకురండి!



వెల 3 రూపాయలు
ప్రతి నెలా
ఒక కొత్త పుస్తకం

ఈ పుస్తకములు
కూడా కలవు:

- బాలకృష్ణుడు
- హనుమంతుని కథ
- మధ్వాచార్య

త్వరలో విడుదల:

- కొండంత గోపాలుడు

ట్రేడ్ ఎంక్వైరీలకూ, వి పి పి ఆర్డర్లకు సంప్రదించండి

IBH **ఇండియా బుక్ హౌస్**

3, A. రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు - 3

KIRON / IBH /81/2

# You never got so much freshness out of a pack before!

Old Spice

the mark of a man

Quality products from Menezes-Shulton.
Mfd. By Colfax Laboratories (I) Pvt. Ltd.

**Old Spice Talc in a trim new pack with 40g. more spice than before**

Peppery, potent Old Spice. A masculine fragrance that refreshes. Now get more of it in a more streamlined pack than before.

CHAITRA-OS-74

8_5_81

( గత సంచిక తరువాయి )













శ్రీకృష్ణుడిట్లు పరమజ్ఞానంబునకు కారణంబులగు వాక్యంబులనేకంబులు చెప్పి, అరుసు డడిగిన వానికి సదుత్తరంబులిచ్చి, వాని ... ము పోదర్చి, రణోత్సాహము కలిగించెను










[ఇంకా ఉంది]

గత సంవత్సరం
అన్నిబట్టలకీ కీ వాడడంద్వారా
ఇంట్లోబట్టలు
ఉతికేందుకయే ఖర్చులో
రూ.100/- పొదుపుచేసాను!



కీ
ఇతర
పేరెన్నికగన్న
డిటర్జెంట్లకన్న
30% తక్కువ ధరలో!




అమితచర్య గల కీ వేణ్ణీళ్ళలో గానీ, చన్నీళ్ళలోగానీ ఇట్టే కరిగి సమృద్ధిగా నురుగును ఇస్తుంది. బట్టలలో బాగా లోతుకు చేరి మురికిని పూర్తిగా తొలగిస్తుంది.
అమిత తెలుపు చేసే శక్తి గల కీ మీ బట్టలకు అదనంగా తెల్లదనాన్ని, అదనంగా తళతళనూ సమకూరుస్తుంది. దీనిలో అమిత చర్యతో తళతళ లాడేలా చేసే పదార్థం ఉండటమే అందుకు కారణం
అమిత పొదుపు చేసే కీ 40 గ్రా., 200గ్రా., 500 గ్రా, 1 కె.జి, 2 కె.జి ప్యాకింగులలో దొరుకుతుంది.

అమిత చర్య!
అమిత తెలుపుదనం!
అమిత పొదుపు!

కీ
నీలి డిటర్జెంట్ పౌడర్

గోద్రెజ్
ఉత్పాదన

(CHAIRTA-G-187 TEL)


# అమెరికన్

తొలిసారిగా అంతరిక్షంలోకి వెళ్లిన జాన్‌గ్లెన్, భూతలంపై నున్న విద్యుదుత్పాదన యంత్రాలనుంచి వస్తున్న పొగను తాను చూడగలిగానని చెప్పినప్పుడు, అది అసాధ్యమని కొందరు శాస్త్రజ్ఞులు అపహాస్యం చేశారు. అది 1962 నాటి సంగతి.

## 'కొలంబియా'

ఈ పందొమ్మిది సంవత్సరాలలో ఎన్ని మార్పులొచ్చాయో! ఇప్పుడు అమెరికా జానయంగ్, రాబర్ట్ క్రిప్పెన్‌లతో అంతరిక్ష రాకపోకల వాహనాన్ని ప్రయోగించింది. (ఏప్రిల్ 12–'81) ఈ వాహనంలో రైళ్లలో లాగానూ, బస్సులలోలాగానూ, విమానాలలో లాగానూ మనుషులను, సాధన సామగ్రిని అంతరిక్షానికి తీసుకపోయి, దానిలోనే మరల భూమికి తిరుగు ప్రయాణం చేయవచ్చు. భవిష్యత్తులో అంతరిక్షంలో ఏర్పాటు కాబోయే పెద్ద పెద్ద కర్మాగారాలలో పనిచేసే నిపుణులను, కార్మికులను తీసుకపోవటానికి, వస్తువులను ఆ కర్మాగారాలకు చేరవేయటానికి, మళ్లీ ఆ మనుషులను భూలోకంలో తమ గృహాలకు చేర్చటానికి, అంతరిక్ష ఫ్యాక్టరీలలో తయారయ్యే వస్తువులను భూలోకానికి రవాణా చేయటానికి ఈ అంతరిక్ష విమానాలు పనికి వస్తాయి.

## అమెరికా అంతరిక్ష కార్యక్రమ ప్రారంభం

అమెరికా అంతరిక్ష పరిశోధన కార్యక్రమం 1958 లో ప్రభుత్వపరంగా ప్రారంభమైంది. ఆయేడే అమెరికా విమాన, వ్యోమ పరిశోధన సంస్థ (నాసా) ఆవిర్భవించింది. ఆ సంవత్సరారంభంలో ఎక్స్‌ప్లోరర్ – 1 అనే ఒక శాస్త్ర పరిశోధన ఉపగ్రహాన్ని ప్రయోగించింది. ఈ ఉపగ్రహం భూ ప్రదక్షిణ చేస్తూ వాన్ ఎలెన్‌బెల్ట్స్ అనే రేడియేషన్ క్షేత్రాలను కనుగొన్నది.

అయితే, ప్రైవేటు నిపుణులు అంతకు ముందు 40 సంవత్సరాలనుంచి ఆకాశ పరిశోధన కార్యక్రమంలో కృషి చేస్తున్నారు. 1981 లో రాబర్ట్ గొడార్డ్ ఒక చిన్న రాకెట్‌ని ప్రయోగించాడు. రాకెట్లు పనిచేస్తాయని ఈ ప్రయోగం ధృవపరచింది. 1926 లో తొలి ద్రవ ఇంధన రాకెట్ ప్రయోగించబడింది. 1936 లో, ఇప్పుడు జెట్ ప్రొపల్షన్ లేబొరేటరి ఉన్న పెసడేనాలో రాకెట్ పరిశోధన కార్యక్రమానికి అంకురార్పణ జరిగింది.

1957 అక్టోబరులో రష్యా స్పుత్నిక్‌ని ప్రయోగించటంతో ఈ పరిస్థితి మారిపోయింది.

# సినిమా విశేషాలు

—జి.వి.జి.

## డైరెక్టర్ ధవళ సత్యం చిత్రాలు

"జాతర, యువతరం కదిలింది" చిత్రాల తర్వాత ధవళ సత్యం దర్శకత్వం నెఱపిన మాదాల రంగారావు చిత్రం "ఎర్రమల్లెలు" మే మొదటి తేదీన విడుదలవుతుంది. నటుడు రామకృష్ణ సమర్పించే ఆర్. కె. మూవీస్ "రామాపురంలో సీత" చిత్రం షూటింగ్ ఏప్రిల్ 11న మొదలైంది. చాలాకాలం తర్వాత డూండీ నిర్మించే చిత్రం మే మాసంలో సెట్స్‌కు వెళ్తుంది. ఇంకా వి. వెంకటేశ్వర్లు నిర్మించే పద్మశ్రీ ఆర్ట్స్ చిత్రం, శబరి ఆర్ట్ పిక్చర్ తొలిచిత్రం, నవజీవన్ పిక్చర్స్ చిత్రం, కె. సి. శేఖర్‌బాబు నిర్మించే చిత్రానికి ధవళ సత్యం దర్శకత్వం నెఱపబోతున్నారు.

## కృష్ణతో రామానాయుడి చిత్రం

సురేష్ మూవీస్ త్వరలో మొదలెట్టే చిత్రానికి బోయిన సుబ్బారావు దర్శకుడు.



'గువ్వల జంట'లో జయమాలిని, రంగనాథ్



'సత్యం — శివం'లో అక్కినేని



'రాణీకాసుల రంగమ్మ'లో జయమాలిని

## మా లక్ష్మి బంగారం

"నెల్లూరు, హైదరాబాద్ ప్రాంతాల్లో మే మొదటి వారం నుంచి జూన్ మొదటి వారం వరకూ ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది," అన్నారు ముత్యాల సుబ్బయ్య. ఈయన దర్శకత్వంలో వాసిలి నాగేశ్వరరావు కథ రాసి నిర్మించే రోహిణి చిత్రవారి పై చిత్రంలో శ్రీధర్, చంద్రమోహన్, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, రాళ్ళపల్లి, కొత్త నటుడు సుబ్బరాజు నటిస్తారు. అప్పలాచార్య, సిద్ధాంతి సంభాషణలు రాశారు. జె.వి. రాఘవులు సంగీతం, దశరథరావ్ ఛాయ, కె. నాగేశ్వరరావు కూర్పు, దిలీప్‌సింగ్ శిల్పంతో కొండూరి సుబ్బారావు నిర్వాహకుడు. [35వ పేజీ చూడండి]

సీరియల్

# రాగబంధితాలు

## వేమకోటి సీతారామ శాస్త్రి

(గత సంచిక తరువాయి)

"కానీ ...... కానీ...... నేను మీ జీవితంలో ప్రవేశించడానికి తగను" అంది లలిత గాద్గదికంగా. సత్యమూర్తి ఆశ్చర్యపోయాడు.

"ఏం! యెందువలన ..." ఆమె చుబుకాన్ని పట్టి యెత్తి, అర్థింపుగా అడిగాడు.

"మీ ప్రేమకు అనర్హురాల్ని ... ... కారణాలు అడక్కండి......"అంటూ యేడుస్తూ బయటకు వెళ్లిపోయింది. ఆమె హృదయం ఆవేదనకు గురయి పోతున్నది. భగవంతుడు జీవితానికి విషమ పరిస్థితి లాంటిదే పెట్టాడు. కారణం తెలియని సత్యమూర్తి తోటలోకి వెడుతున్న లలితను అనుసరించాడు.

* * *

సాయంకాలం నాలుగైంది. బద్ధకంగా వొళ్లు విరుచుకుని లేచాడు రాంబాబు. వంటమనిషి కాఫీ ఇచ్చిపోయింది. ఉదయం ఊరల్లా తిరిగాడేమో, మరీ అలసిపోయాడు, రాంబాబు. ఎవ్వరూ లేక పోవడంతో ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. లైఫ్ మ్యాగజైను చదవాలని తీశాడు, రాంబాబు. కానీ ఆ ప్రయత్నానికి భంగమే కలిగింది.

ఇంట్లో యెక్కడ నుండో వీణానాదం విన్పిస్తోంది. హంసధ్వని రాగం ఆలాపన విన్పిస్తోంది. రాంబాబు లేచి నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ, రాగం విన్పించిన వేపు వెళ్లాడు.

ఒక గది గుమ్మం ముందు అతను ఆగి పోయాడు. ఇది కలా నిజమా అన్న భ్రాంతి కలిగింది. కంజీవరం ఆర్గ్రద పురుగు రంగు పట్టుచీరలో నీరజ దేవతలా మెరిసిపోతోంది. గదిలో ఎర్రటి వెల్వెట్ కార్పెట్. దాని మధ్య నీరజ వీణ పట్టుకుని లీనమై వాయిస్తోంది.

ముందు రాగాలాపన అయిన తరువాత హంస ధ్వని రాగంలో 'వాతాపి గణపతిం భజేహం' వాయించింది. తర్వాత ఖరహర ప్రియ రాగంలో "ప్రక్కల నిలబడి కొలిచే ముద్దాడ" కీర్తన వాయించింది. రాంబాబు ద్వారం ముందునే కూర్చున్నాడు భక్తుడిలా. నీరజను తదేకంగా చూస్తున్నాడు. అమృతవాహినిలా వీణానాదం అతన్ని మరో లోకాలకు తీసుకుపోతున్నది.

నీరజ వదనం మీద స్వేద బిందువులు ముత్యాల్లా రాలుతున్నాయి. కీర్తన అయిపోయాక వాయించటం ఆపి చెమటను తుడుచుకుంటూ యెదురుగా చూసింది. ఆమెకు నవ్వు వచ్చింది. ద్వారం దగ్గర యెదురుగా మఠం వేసుకుని రాంబాబు కూర్చున్నాడు.

వీణానాదం ఆగిపోగానే రాంబాబు కళ్లు విప్పి చూసాడు.

"అప్పుడే ఆపేసారేం" అన్నాడు.

"అక్కడే కూర్చున్నారు ? లోపలికి రావచ్చుగా !" అంది నీరజ.

"ఇంత పవిత్రమైన దేవాలయంలో అడుగు పెడితే మీ ఏకాగ్రతకు భంగం కలుగుతుందేమోనని ... "

"ఫర్వాలేదు రండి. మీకు మాత్రం ప్రవేశం వుంది."

రాంబాబు లోపలికి వెళ్లి వీణ దగ్గరగా కూర్చున్నాడు. నీరజ వేపు కన్నార్పకుండా చూస్తున్నాడు. రోజూ చూస్తున్న నీరజకు, ఇవాళ చూస్తున్న నీరజకు అసలు పోలికేలేదు. నీరజ సిగ్గుపడిపోయింది.

"ఇవాళ నా జీవితం ధన్యమైపోయింది. భగవంతుడా ! ఇది కల మాత్రం కాకుండా చెయ్యి" అన్నాడు. నీరజ కూడా రాంబాబులో ఇంత ఆనందం యెప్పుడూ చూడలేదు.

"ఇది కల కాదు సార్. చెయ్యి గిల్లుకోండి" అంది నీరజ నవ్వుతూ.

"నిజంగా ఈ వీణ వాయిస్తూంటే మీరు అపర సరస్వతిలా వున్నారు" అన్నాడు.

"పొగిడేవాళ్లంటే నాకు కోపం" అంది నీరజ బుంగమూతి పెడుతూ.

"మీరు నిజంగా చాలా బాగా వాయిస్తారు." అన్నాడు ప్రశంసాపూర్వకంగా.

"ఆ యేదో చిన్నప్పుడు ఊసుపోక యిక్కడే మా శాంతితోబాటే మా పిన్ని నేర్పించింది" అంది.

"మరొక పాట వాయించండి నాకోసం" అన్నాడు. నీరజ అతనివేపు చూసింది. అతని కళ్లలో యెంతో ప్రాధేయత వుంది. నీరెండ కిటికీగుండా గది నాక్రమించి, వింతకాంతిని సంతరింపజేస్తున్నాది.

"యేం పాట వాయించమంటారు ?"

"మీ ఇష్టం వచ్చినది.

"అలాక్కాదు. మీ ఇష్టం వచ్చినది.

"రఘువంశ... వాయించండి."

నీరజ కదన కుతూహల రాగం ఆలాపించింది. తర్వాత కీర్తన యెత్తుకుంది. ఎన్నో గమకాలు వేసి అరగంటసేపు వాయించింది. ముగ్ధుడైపోయాడు రాంబాబు. "ఎవరు చేబడతారో యింత కళాకారిణిని. ఆ వ్యక్తి చాలా అదృష్టవంతుడవుతాడు" అని మనస్సులో అనుకున్నాడు.

వీణ పెట్టెలో పెట్టి నీరజ డ్రాయింగు రూములోకి వచ్చింది. పనిమనిషి ఓవల్టిన్ కలిపి తీసుకువచ్చింది.

"వొక ప్రశ్న అడుగుతాను యేమనుకోరా" అన్నాడు కప్పు చేతిలోకి తీసుకుంటూ.

"అడగండి" అంది నీరజ, ఆశక్తిగా.

"ఇంత చక్కని అభిమానం గల అప్పచెల్లెళ్ళి, అన్నదమ్ముడ్ని ఉంచుకుని, యెందుకా ఉద్యోగం చెయ్యడం నీరజగారూ" అడిగాడు.

**జరిగిన కథ–8 :** ఆ ఆఫీసులో కొత్తగా స్టెనో కమ్ క్లర్క్‌గా జాయిన్ అవుతుంది మిస్ నీరజ. మేనేజర్ శివకుమార్ ఆమెపై ఒక ప్రత్యేకమైన అభిమానాన్ని చూపిస్తుంటాడు. అక్కడే గుమాస్తాగిరి చేస్తున్న రాంబాబు దయనీయమైన పరిస్థితిని చూసిన నీరజ అతనికి ఆర్థిక సహాయం చేస్తుంది. ఓనాడు బస్సులో పరిచయమైన లలిత ఇంట్లో ఓ రూములో వుంటుంటుంది నీరజ. నీరజను ప్రేమిస్తున్నాననీ, ఆమె బాధ్యతలను తను స్వీకరిస్తాననీ, పెళ్లి చేసుకుంటామనీ శివకుమార్ ఆమెను అడుగగా, నీరజ కొంత టైం కోరుతుంది. జీవితంలో చావుదెబ్బ తిన్న తన స్నేహితురాలు పద్మ గత చరిత్ర గురించి నీరజతో చెప్తుంటుంది లలిత. తన మేనేజర్ సతీష్ పుట్టిన రోజునాడు అతను కోరిన కోర్కె — అతనితో సినిమా ప్రోగ్రాం, ఆ తరవాత అతని ఇంట్లో భోజనం చేయటానికి అంగీకరించుతుంది పద్మ. సతీష్‌ను నమ్మి అతనికి తన సర్వస్వమూ అర్పించుకొంటుంది పద్మ. ఫలితంగా గర్భవతౌతుంది. ఆమెకు తెలియకుండా సతీష్ ఎబార్షన్ చేయిస్తాడు. తరువాత అతని నిజస్వరూపం తెలుసుకొని కుమిలిపోతుంది. సతీష్ ఆమెను ఉద్యోగంలోంచి తీసివేస్తాడు. ఇప్పుడు మరో ఉద్యోగం సంపాదించుకొని గత జీవితాన్ని మరిచిపోవటానికి ప్రయత్నిస్తూంటుంది పద్మ. అజ్ఞాతంగా 'బాబు' అన్న పేరుతో రచనలు చేస్తున్న రాంబాబు తన గత జీవిత చరిత్ర గురించి లలిత, నీరజలకు చెప్తుంటాడు. శివకుమార్ తండ్రి రమణయ్య దశరథరామయ్యగారి కుటుంబాన్ని సర్వనాశనం చేస్తాడు. దశరథ రామయ్యగారి సహాయం పొందిన ఒకాయన ఇప్పించిన ఉద్యోగంలో చేర్తాడు రాంబాబు. అక్కడికి శివకుమార్ మేనేజర్‌గా వచ్చి అతనిని నానా హింసలు పెడ్తుంటాడు. రాంబాబు పరిస్థితుల ప్రభావానికి తలవొగ్గి తన కుటుంబాన్ని అలానే నెట్టుకొస్తుంటాడు... రాంబాబు దయనీయమైన గత జీవితాన్ని తెలుసుకొన్న ఆ రోజు చాలా మంచిరోజుగా భావిస్తారు లలిత, నీరజలు. మూడు రోజులు శెలవులు కలసిరాగా లలిత, నీరజ, రాంబాబు ముగ్గురూ కలిసి నీరజ పిన్నిగారి వూరు వెళతారు. ఆ పిన్ని కూతురు శాంతి, కొడుకు సత్యమూర్తి. ఓ పసిపిల్ల ప్రాణం కాపాడబోయి తన కాలు పోగొట్టుకొన్న సత్యమూర్తిని అంతవరకూ గాఢంగా ప్రేమించిన సునంద అతన్ని కాదని తండ్రి కుదిర్చిన సంబంధమే చేసుకొంటుంది. సత్యమూర్తి ఆ జ్ఞాపకాలను మర్చిపోలేక అలా పర్ణశాలలో నిర్జీవంగా బ్రతుకుతూంటాడు. తన జీవితంలో ప్రవేశించి, తన జీవితాన్ని కాంతిమయం చేయమని లలితను సత్యమూర్తి ప్రాధేయపూర్వకంగా అడుగుతాడు.

నీరజ ఆ ప్రశ్నకు గతుక్కుమంది.

"నిజమే. కాని యెంత బంధువులున్నా, మనం ఆత్మాభిమానంతో బ్రతకడంలో వుండే తృప్తి, యిలా పరభాగ్యోపజీవి కావడంలో వుందంటారా ?" అంది నీరజ అతని కళ్లల్లోకి సూటిగా చూస్తూ.

"మీరన్న అభిప్రాయంతో యేకీభవిస్తాను. కానీ యిక్కడి వాతావరణం అలా కన్పించలేదు. ఇది కేవలం మీ స్వంత యిల్లనే భావనే నాకు కలుగుతోంది," అన్నాడు.

"అలా అనుకోవడం, సంచరించటం, మన మనస్సులోనే వుంది" అంది నవ్వుతూ నీరజ. ఎరుపెక్కిన సూర్యుడు అలసిపోయి పశ్చిమాభిముఖుడైపోయాడు. హుందాగా రాణీలా వున్న నీరజను చూసి యేదో చెప్పాలనుకున్నాడు. కానీ చెప్పలేకపోయాడు.

"లలితగారు యింకా రాలేదేం చెప్మా" అన్నాడు. నీరజ నవ్వింది.

"వస్తుంది. అన్నయ్యతో బాతాఖానీ కొడుతూ కూర్చుండి వుంటుంది" అంది. రాంబాబు అర్థం చేసుకున్నాడు.

"నిజమే, లలితగార్కి, ఆ పర్ణశాల బాగా ఆకర్షించింది" అన్నాడు.

"ఆ ఆకర్షణే శాశ్వతమయిపోతే బాగుండును" అంది సాలోచనగా.

రాంబాబుకు అర్థంకాలేదు.నీరజవేపుచూసాడు.

"లలిత చాలా అందగత్తె. సంస్కారవంతురాలు. సరళ హృదయని. లలిత ఈ యింటికి కోడలుగా వచ్చి, మా అన్నయ్య చీకటి జీవితంలో జ్యోతి వెలిగిస్తే యెంతో బాగుంటుంది" అంది ఆశగా.

"ఇదే జరిగితే నిజంగా ఆమె జీవితం ధన్యమౌతుంది" అన్నాడు.

"ఏం. ఎందుకు జరగదు, స్త్రీకి వివాహం జీవితంలో వొక అపూర్వ అనుభవం. ఆమె జీవితం నిర్దిష్టంగా పయనించే రహదారి అప్పట్నుంచే యేర్పడుతుంది. మా అన్నయ్యను చేసుకునే హృదయ సంస్కారం లలితకు లేదంటారా ?" అనుమానంగా అడిగింది.

"సంస్కారం వేరు... అర్హత వేరు... జీవితం వేరు."

"ఏమిటో మీ మాటలు అర్థం కాలేదు." అనుమానంగా అంది.

"ఇద్దరూ సంస్కారవంతులైనా, లలిత బహుశా ఈ పెండ్లికి వొప్పుకోదేమో !"

"ఏం ఎందువలన ! మీకేమయినా లలిత గురించి తెలుసా ?" గుచ్చి గుచ్చి అడిగింది. రాంబాబు తప్పించుకోలేకపోయాడు.

"ఏం లలిత గురించి మీకేం తెలియదా ? ఇంతకాలం మీ స్నేహం సామాన్యమైనదేనా ?" అడిగాడు.

నీరజ నిరుత్తరురాలైంది.

"చెప్పండి. ప్లీజ్. లలిత గురించి మీకేం తెలుసో" అంది నీరజ ప్రాధేయపూర్వకంగా. ఉత్సాహంగా, తుళ్లుతూ, ఆదివారంనాడు సినిమాలు చూస్తూ, ఆనందంగా గడిపే లలిత జీవితంలో యేముందీ అన్న ఆసక్తి నీరజలో అధికమైంది.

"చెబుతానుగానీ మళ్లా మీరు అభిమానంతో అడిగినా, ఆమె హృదయం—వేదనతో చిత్రవధ చేసినవాళ్లమవుతాం." నీరజ తలవూపింది. రాంబాబు చెప్పటం ప్రారంభించాడు.

నీరజకు ప్రతీ సంఘటన జ్ఞాపకం వస్తున్నాది. ఆ రోజు రాత్రి లలిత పద్మ గురించి, సతీష్ గురించి చెప్పిన సంఘటనలే సినిమా రీలులా, నీరజ మస్తిష్కంలో తిరుగుతున్నాయి. అయితే అది పద్మ జీవితం కాదన్నమాట. అందుకనే ఆ రోజు అంత వేదనతో చెప్పింది. అన్నీ నీరజకు జ్ఞాపకం వస్తున్నాయి. లలిత హృదయం దుర్భరమైన



అనుభవంతో కుమిలిపోయిందన్న సంగతి నీరజకు తెలియదు. రాంబాబు చెప్పటం ముగించాడు. నీరజ కళ్లనిండా అశ్రువులు వర్షిస్తున్నాయి. ఆమెది అంత నవనీత హృదయం. ఎదుటివారి కష్టం తన కష్టంగా భావించే సున్నిత హృదయిని నీరజ.

చివరలో రాంబాబు గొంతుక కూడా గాద్గదికమై పోయింది.

"అదేమిటి ఏడుస్తున్నారా ? కళ్లు తుడుచుకోండి" అని హెచ్చరించాడు.

"ఇంతకీ అవతల వ్యక్తి ఎవడు ? అతన్నిపుడు పట్టుకుని లలిత జీవితాన్ని సరిదిద్దలేమా ?" అడిగింది గాద్గదికంగా.

"అవతల వ్యక్తి ఎవరయితేనేం. నరరూప రాక్షసుడు. ఆడవాళ్ల జీవితాల్తో బంతాట లాడుకునే దౌర్భాగ్యుడు. వాడివల్ల లలిత జీవితం బాగుపడ గూడదు. లలిత వాడికెన్నోదో చెప్పలేం. వాడి పేరు మీతో చెప్పడం కన్నా చూపిస్తాను. అందువల్లే లలిత జరిగినదంతా పీడకల అని భావించి, జీవితాన్ని నిర్లిప్తంగా దొర్లిస్తున్నాది" అన్నాడు. నీరజ చుట్టూ ఆలోచనలు ముసురుకున్నాయి. ఏమిచేస్తే లలిత జీవితం బాగుపడుతుంది. క్షణంసేపు మాట్లాడలేకపోయింది

"ఇదంతా మీకెలా తెలుసు" అడిగింది శూన్యంలోకి చూస్తూ.

"అపుడు లలిత నేనూ కలిసి ఒకే ఆఫీసులో పనిచేశాం" అన్నాడు.

"అపుడు మీరు లలిత జీవితాన్ని పెడమార్గం పట్టకుండా హెచ్చరించవచ్చు కదా !" అంది నిందా పూర్వకంగా.

"ఎలాగ. ఎవరి జీవితం వారిది. ఇంకోరి జీవితానికి సలహాలుగానీ, సరిదిద్దటం గానీ, మనంతట మనం స్వంతంగా చేయలేం. అయినా నాకీ విషయం తెలిసేటప్పటికి పరిస్థితి చాలా దూరం వెళ్లిపోయింది. అందువలననే సానుభూతి కన్నా ఇంకో రకంగా ఎలాగా ఆదుకోలేకపోయాను" అన్నాడు విచారంగా.

ఎదురుగా బండి గంటల చప్పుడు వినిపించింది. గుమ్మం దగ్గర సుబ్బన్న ఆపాడు. శాంతి దిగి లోపలికి వచ్చేటప్పటికి ఇద్దరూ మాట్లాడకుండా కూర్చున్నారు.

"ఇదేమిటి ఇద్దరూ దెబ్బలాడుకున్నారా ఏమిటి? మాట్లాడకుండా కూర్చున్నారు" అంది. అప్పటికి గానీ వాళ్లు ఆలోచనల వలయం నుండి బయటకు రాలేదు.

"అబ్బే. ఏం లేదు ! ఇంతకీ ఫంక్షను బాగా జరిగిపోయిందా" అంది నీరజ.

"ఆ బాగానే జరిగిపోయిందే. నువ్వొచ్చావని తెలిసిన వాళ్లందరూ నన్ను, నిన్ను తీసుకురాలేదని కోపం బడ్డారు. రేపైనా ఒకసారి వెళుదూ" అంది.

"ఈసారి కుదరదులే. ఇంకోసారి వచ్చినపుడు వెళ్తాను" అంది నీరజ.

"అన్నట్లు లలితగారేరీ."

"పొలం వేపు వెళ్లింది" అంది నీరజ. శాంతి లోపలకు వెళ్లటం, లలిత లోపలికి రావటం ఒక్కసారే జరిగింది. నీరజ లలితను చూసింది. చాలా నీరసంగానూ, వడలి పోయినట్లుగాను కన్పించింది. మునుపటి హుషారు దరంలేదు.

"ఏమిటి అలా వున్నావు? ఒంట్లో బాగుండటం లేదా" అడిగింది నీరజ ఆతృతగా.

"లేదే. బాగానే వున్నాను. మీ అన్నయ్యగారితో బాతాఖానీ కొడుతూ యింతసేపూ వుండిపోయాను." అంది లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ. కాస్సేపాగి—

"ఈ చీరలో నువ్వు చాలా బాగున్నావే" అంది నవ్వి లలిత.

"నేను లలితగారి అభిప్రాయాన్ని బలపరుస్తున్నాను" అన్నాడు రాంబాబు.

నీరజ సిగ్గుతో నవ్వేసింది.

శాంతి లడ్డూలు ట్రేలో పెట్టి పట్టుకు రావడంతో బరువైన వాతావరణం నెమ్మదిగా తేలికయింది.

అర్ధరాత్రయింది. లలితకు దాహం వేసింది. లేవడానికి బద్ధకంగా వుంది. అయినా గొంతుకు యెండిపోతున్నాది. మంచినీళ్లు త్రాగుదామని బలవంతంగా లేచింది. ఎదురుగా నీరజ మంచంమీద దిండుకు చేరబడివుంది. ఆమె కండ్లు అశ్రువులు వర్షిస్తున్నాయి. లలితకు అర్థం కాలేదు.

"నీరజా... నీరజా" లలిత పిలిచింది. నీరజ ఆమెవేపు అయోమయంగా చూసింది.

"ఎందుకే అలా వున్నావ్ ! ఏం జరిగిందే" అడిగింది గాభరాగా దగ్గర కూర్చుంటూ.

నీరజ ఏం మాట్లాడలేదు. అకస్మాత్తుగా లలితను కౌగిలించుకుని భోరుమని యేడ్చింది. లలితకు నీరజ ప్రవర్తన అర్థం కాలేదు.

"ఎలా భరిస్తున్నావే, ఇంత కష్టాన్ని. ఎలా సహిస్తున్నావే యింత దుఃఖాన్ని. నా కెందుకు చెప్పలేదే యింత కాలం వరకూ... నేను... నీకేం కావా" అంది నీరజ బేలగా ఏడుస్తూ.

లలితకు అర్థమయిపోయింది. తను భరిస్తున్న కష్టంమీద ఒక అమృత హృదయుని సానుభూతి - యెవ్వరితో చెప్పకోలేని బాధ యింకొక ఆత్మీయురాలు పాలు పంచుకోంటున్నది. రాంబాబే చెప్పివుంటాడనుకుంది. దుఃఖం పట్టలేకపోయింది.

"ఏమని చెప్పకోమంటావ్. ఎవరితో చెప్పకోమంటావ్. అందుకనే నాలో నేనే ఆ కాలకూటాన్ని దిగమింగి, బ్రతకలేక బ్రతుకుతున్నానే. నన్ను క్షమించవే నీరజా" అంటూ భోరున యేడ్చింది.

ఇన్నాళ్లకు లలిత హృదయం తేలికయింది. నిజమే. బాధలు, కష్టాలు యింకొకరితో చెప్పకున్నపుడుగానీ, తెలిసినపుడుగానీ వారు పిడికెడు సానుభూతి పంచియిస్తే హృదయం అలా అవుతుంది మరి. ఎంతసేపు అలా గాఢ పరిష్వంగంలో వున్నారో వాళ్లకే తెలియదు. బాధా తప్త హృదయాలు సేదదీరాయి.

"లేదు. నీ జీవితం యిలా రాలిపోవడానికి వీలులేదు. నీ జీవితానికో దారి చూపించాలి. నీ జీవితం చిగురించాలి" అంది, దృఢంగా కళ్లు తుడుచుకుంది నీరజ. లలిత కన్నీరు తుడిచింది. లేచి కూజాలో వున్న నీళ్లు గ్లాసుతో లలిత కిచ్చింది.

"ఎందుకు నీరజా ! ఈ జీవితంలో యింతే చేసుకున్నాను. నా గురించి నీవు దిగులుపడకే. నీలాంటి ఆత్మీయుల మధ్య నా జీవితం సరిహద్దులు దాటిపోవాలన్న కోరిక తప్పించి నాకింకో అభిలాష లేదే" అంది లలిత దిగులుగా.

"ఎందుకలా నిర్లిప్తంగా మాట్లాడతావు. అప్పుడే చావుని ఆహ్వానించకే. నీ జీవితాన్ని సరిదిద్దుకోవటం నీ చేతిలో వుంది. రెండు దశాబ్దాల క్రిందటి మహిళకీ మనకీ యెంతో తేడా వుంది. సమాజంలో న్యాయమైనది అందరికీ ఒకటే... సరేలే...నిద్రపో." అంది, లలితను నెమ్మదిగా అనునయించుతూ.

లలితకు వెంటనే నిద్ర పట్టేసింది. నీరజ మాత్రం నిద్రపోలేదు. ఆమె మస్తిష్కంలో రకరకాల ఆలోచనలు పరిభ్రమించాయి. ఆ ఆలోచనల మధ్య సత్యమూర్తి కన్పించాడు.

* * *

మధ్యాహ్నం మూడు గంటలు కావస్తోంది. ముగ్గురూ ప్రయాణం హడావుడిలో వున్నారు. సుబ్బన్న మైసూరెడ్లకు గంటలు కడుతున్నాడు. ఉదయమే సత్యమూర్తి దగ్గర శలవు తీసుకున్నాడు రాంబాబు.

ఏప్రిల్ 11 న గుడ్ ఫ్రైడే సందర్భంగా విజయవాడ రోటరీ ఆడిటోరియంలో "క్రైస్తవ మహిళా సమావేశం"లో 'బైబిల్' నృత్య రూపకం (కూచిపూడి, భరతనాట్యం)లో పాటలను గానం చేస్తున్న కుమారి ఎం. ఎం. ఎస్. మనోహరం, గాయకుడు కె. సూర్యనారాయణ. ఆర్కెస్ట్రా గణేష్, పి. పి. ఆనంద్, కోటయ్య, ప్రసాద్, అప్పారావులున్నారు.



# ఇదిగో!

క్రొత్త

# ప్రెస్టేజ్

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్




100% భద్రత

## అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన క్రొత్త ప్రెస్టీజ్ మీరుకోన బోయే అతి భద్రమైన ప్రెషర్ కుక్కర్

ఆహార పదార్థములచే వెయిట్ వాల్వ్ మూయబడినచో మీ ప్రెషర్ కుక్కర్‌లో హెచ్చు ఒత్తిడి కలుగును. అట్టి సమయమున మీ కుక్కర్ భద్రత సేఫ్టీ ప్లగ్ మీదనే ఆధారపడియుండును మీ ప్లగ్ నకిలీదై వుండవచ్చు. మీకు తెలియదు...ఎందువలనగా మీరు అసలు సేఫ్టీ ప్లగ్‌ను నకిలీ ప్లగ్‌ను గుర్తించలేరు.

అందువలనే, పూర్తి భద్రత మనసులో ఉంచుకొని ఏమాత్రము ప్రమాదము జరగడానికి వీలులేకుండా, ఈ "క్రొత్త ప్రెస్టీజ్" రూపొందించాము. దీని అద్వితీయ గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ మీ కుక్కర్ భద్రతను ఎల్లకాలము కాపాడుతు సేఫ్టీ ప్లగ్ అవసరము లేకుండా చేస్తుంది.



### అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా క్రొత్త ప్రెస్టీజ్‌కు నూటికి నూరు పాళ్ళు భద్రత ఎలా సమకూరుతుంది?

సేఫ్టీ ప్లగ్‌ను త్రోసి వేసేంతగా ఒత్తిడి పెరుగకముందే అధిక ఆవిరి గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా ఖచ్చితముగా బయటకు పోవును. నకిలీ లేక పాత "స్పేర్స్" వాడినను, మీ ప్రెషర్ కుక్కర్ పూర్తి భద్రతనిచ్చును. ఎల్లవేళలందు.



### క్రొత్త ప్రెస్టీజ్ మీకు ఎక్కువ సౌకర్యము నిచ్చును

గేస్కెట్ ఆవిరిని వొదిలిపెట్టగానే మీరు చేయవలసింది దాని స్థానము లోనికి దానిని తొయ్యడము మాత్రమే.
అప్పుడు మీ కుక్కర్ తిరిగి వాడకానికి కొన్ని క్షణములలో సిద్ధము.
సేఫ్టీ ప్లగ్గే అనవసరము. అందుచే దానిని మార్చే అవసరములేదు.
దాని గురించి చింతించనవసరములేదు.



### క్రొత్త ప్రెస్టీజ్ ఎంతో మన్నిక కలది

ఆవిరి ఒత్తిడి ఏ సమయమునైనను అపాయకరమైన స్థితికి చేరదు కనుక, కుక్కర్‌కు అరుగుదల చాల తక్కువ. అందుచేతనే మిగతా మామూలు కుక్కర్లకన్న క్రొత్త ప్రెస్టీజ్ చాలకాలము మన్నును.



### క్రొత్త ప్రెస్టీజ్ వల్ల ఎన్నో అధిక లాభములు

* ఎక్కువ మన్నికైన దళసరి అడుగు.
* మన్నికైన స్టెయిన్‌లెస్ స్టీలు స్క్రూలతో బిగించిన దృఢమైన పిడులు.
* ఎప్పుడు వేడెక్కని, పట్టునిచ్చు క్రొత్త "అక్సులరీ" పిడి.
* పరుత్వము, దృఢత్వము కలిగిన క్రొత్త "ట్రివెట్"
* అద్దములాంటి అందమైన తళతళ.
* ఉత్సాహము కలిగించు క్రొత్త వంటల పుస్తకము.
* అనుకూలమైన ఆరు సైజులు.

మరియు ఏ లాభములవలన భారతదేశములో 30 సంవత్సరములకు పైగా ప్రెస్టీజ్ కుక్కర్ అందరికి కావలసిన కుక్కర్ అయినదో ఆ లాభములన్నీ ఇందులో వున్నాయి.

ttk తయారి.

Prestige



భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు

# రాగబంధితులు

''ఇంకొక రెండు రోజులుంటే బాగుండునే అక్కయ్యా'' అంది శాంతి దిగులుగా.

''మాకూ వుండాలనే వుంది. సెలవు లేదు. ఈసారి వారంరోజులు ప్రోగ్రాం వేసుకుని మరీ వస్తాం. మీరు పొమ్మన్నేవరకూ పోం'' అన్నాడు రాంబాబు, శాంతివేపు చూస్తూ. నీరజ యెక్కడ వుండిపోదామంటుందోనని అతని భయం.

లలిత హడావుడిగా ఆ గదిలో నుండి ఈ గదిలోకి, ఈ గదిలోనుండి ఆ గదిలోకి తిరుగుతోంది.

''ఏమిటే అంత హడావుడిగా వున్నావు'' అడిగింది నీరజ.

''ఏంలేదే. నా హేండ్‌బ్యాగ్ కన్పించటంలేదు.''

''ఎక్కడ పెట్టావో జ్ఞాపకం వుందా.''

''గుర్తు రావటం లేదే.''

''జ్ఞాపకం తెచ్చుకో. నిన్న గాని పర్ణశాలకు వెళ్లినపుడు తీసుకెళ్లావా ?''

లలితకు గుర్తు వచ్చింది. అవునంటూ తల వూపింది.

''అయితే వెళ్లి తెచ్చేసుకో'' అంది నీరజ సాలోచనగా. లలిత నీరజవేపు చూసింది. శాంతి, రాంబాబుకు కథల కాగితాలు ఇస్తోంది. వాళ్ల లోకంలో వాళ్లున్నారు.

''అవునే. వెళ్లి తెచ్చేసుకో, దగ్గరేగా. ఇంకా ప్రయాణానికి గంట టైముంది'' అంది. లలిత బుద్ధిమంతురాలిలా, తలవూపింది. లలిత గూడా వెళ్లిపోయే ముందు సత్యమూర్తిని చూడాలని పించింది. తడబడుతున్న అడుగులతో వెడుతున్న లలితను చూసి తృప్తిగా నవ్వుకుంది.

కిటికీలో నుండి జామచెట్టుమీద చిలకల్ని చూస్తున్న సత్యమూర్తి, లలిత రాకను గమనించాడు.

''ఇక్కడ బ్యాగు మరచిపోయాను ... తీసుకు పోదామని'' అంది లలిత నేల చూపులు చూస్తూ.

''తీసికెళ్లు లలితా'' అన్నాడు.

''ఇంకో గంటలో వెళ్లిపోతున్నాం. మీ ఆదరాభిమానాలకు కృతజ్ఞురాల్ని'' అంది హేండ్ బ్యాగ్ తీసుకుంటూ.

ద్వారం వరకూ వెళ్లిన లలిత సత్యమూర్తి పిలుపుతో ఆగిపోయింది. ముగ్ధలాగే వెనుదిరిగి అతని వద్దకు వచ్చింది.

''నీ నిర్ణయం మార్చుకోలేవా ?'' అడిగాడు ఆర్ద్రంగా.లలిత అతనికళ్లలోకిచూసింది.ఆమె కన్నీటి తెర అతని మూర్తిని స్పష్టంగా కన్పించనివ్వలేదు.

''మార్చుకోలేను, సత్యమూర్తిగారూ ... నా జీవితం గురించి మీకు తెలియదు. మీ ప్రేమకు అర్హురాలను కాను.-నన్ను మన్నించండి. అనవసరంగా వచ్చి మీ జీవితంలో మళ్లా దుమారం లేపాను'' అంది ఏడుస్తూ.

''భగ్న ప్రేమికుడు తన జీవితం ఎలా సరిదిద్దుకోవాలో సలహా ఇచ్చిన పవిత్రమూర్తి, తప్పుచేసినా జీవితం సరిద్దుకోవటంలో ఏమైనా పాపం వుందా'' అడిగాడు.

లలిత అప్రతిభురాలైంది. తన గురించి అంతా తెలిసిపోయింది సత్యమూర్తికి. ఏం సమాధానం చెప్పగలదు. సత్యమూర్తి దగ్గరకు వచ్చాడు. లలితను తన పరిష్వంగంలోకి తీసుకున్నాడు.

''ఈ మాత్రం దానికేనా లలితా అంత బాధ పడ్డావు. నిన్న నన్ను నిరాకరించావు'' అన్నాడు ఆమె చుబుకాన్ని పైకెత్తుతూ.

''మీకు...మీకు...అంతా తెలుసా'' అంది అమాయకంగా అతనివేపు చూస్తూ. విశాలమైన అతని ఛాతీమీద, చల్లని ఆశ్రయం లభించిందన్న తృప్తి ఆమె కళ్లలో మెరుస్తున్నది.

''నా కంతా తెలుసు. నీరజ చెప్పింది. తప్పు చేయటం మానవ సహజం. పశ్చాత్తాపం కన్నా మించిన శిక్షలేదు. చేసిన తప్పును సరిదిద్దుకొని జీవితంలో నందనవనం నిర్మించుకోవటం వివేకవంతుల లక్షణం'' అన్నాడు, ఆప్యాయంగా. లలిత నోటమాట రావటంలేదు. ఆనందమో, పారవశ్యమో తెలియని స్థితిలో వుందామె. నీరజకు మనస్సులోనే కృతజ్ఞత అర్పించింది.

## న్యాయం

''ఇది రా దారి కాదు''
బిక్కమొగం వేసుకొని
వచ్చి పోయే జనాన్ని
నిట్టూరుస్తూ చూస్తూంది

* * *

## ఉష

రాత్రి తల్లికి
పెళ్లిగాని కూతురు ఉష
మణులూ, మాణిక్యాలూ మూటగట్టుకొని
ఏడు గుర్రాల బండీవాడితో
లేచిపోయింది

— ఎస్. మునిసుందరం

''ఇప్పటికేనా అంగీకరించినట్లేనా లలితా.''

లలిత మౌనంగానే తల వూపింది అతని ఛాతీని ఆనుకునే. వధువుగా అప్పుడే ఎంతో సిగ్గు ముంచుకొచ్చింది లలితకు. నిన్నటికీ, ఈ రోజుకీ ఆశ నిరాశల మధ్య ఎంత వైరుధ్యం ఒక జీవితంలో. ఎంత మార్పు అనుకుంది లలిత.

''అమ్మ రాగానే త్వరలో ముహూర్తం పెట్టిస్తాను'' అన్నాడు ఆమెను మరింత దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకుంటూ. లలిత బుగ్గలు మరీ ఎరుపెక్కిపోయాయి.

''అమ్మగారూ ! టైమయిపోయింది. నీరజమ్మగారు రమ్మంటున్నారు'' అని పాలేరు కుర్రాడు పిలిచే వరకూ, యిద్దరు ప్రేమికులూ బయట ప్రపంచంలోకి రాలేదు.

''వస్తాను'' అంటూ కళ్లతోనే చెప్పి లలిత బయలుదేరి పోయింది.

శాంతి గూడా అతిధుల్ని దిగబెట్టడానికి రోడ్డు వరకూ వచ్చింది.

''మీ ఆతిథ్యానికి, మీ అభిమానానికి చాలా కృతజ్ఞులం. మంచి కథలు రాయడానికి ప్రయత్నించండి శాంతీ'' అన్నాడు రాంబాబు.

''తెలిసో, తెలియకో ఏమైనా తప్పులు చేస్తే నన్ను మన్నించండి'' అంది చేతులు జోడించి శాంతి.

బస్సు వచ్చింది. సుబ్బన్న పండ్ల బుట్టలు మీదకి ఎక్కించాడు. బస్సు కదులుతూంటే, శాంతి అందరికీ వీడ్కోలు చెప్పింది. ఆర్.టి.సి. బస్సులో ముగ్గురూ ఒకే సీటులో కూర్చోవలసి వచ్చింది. రాంబాబు, నీరజ తర్వాత లలిత కూర్చున్నారు. బస్సు సాఫీ అయిన రోడ్డుమీద సంధించిన బాణంలా దూసుకుపోతోంది.

''ఏమే లలితా ! మీరు ... మీరూ రాజీ పడ్డారా ''' అడిగింది నీరజ.

సిగ్గుపడింది లలిత; మాట్లాడకుండా వూరుకుంది.

''చెప్పవే తల్లీ ... '' అంది బిగ్గరగా.

''జీవితంలో నీ ఋణం తీర్చుకోలేనే నీరజా'' అంది సజల నయనాలతో.

''నీరజ కాదే ... వదినా ... అను'' అంది లలిత చేయి పట్టుకుని మృదువుగా.

''ఏమిటే,మీరిద్దరు మాట్లాడుకుంటున్నారు'' అన్నాడు రాంబాబు నీరజవేపు తిరిగి.

''మీ కెందుకు సార్, ఆడవాళ్ల మాటలు వినాలని ఆసక్తి'' అంది నీరజ నవ్వుతూ.

''ఎంతయినా తోటి ప్రయాణీకుణ్నే కదా. ఆ మాత్రం సానుభూతి వుంచకపోతే ఎలా'' అన్నాడు అమాయకంగా, ముఖం పెడుతూ. కాస్సేపాగి, ''లలితా, నీరజగారి ఋణమే కాదు నా ఋణం గూడా తీర్చుకోలేరు'' అన్నాడు నవ్వుతూ.

''ఏదైనా కథకు ప్లాటు ఆలోచిస్తున్నారా ?'' అంది నీరజ.

''లేదు. కథలా, కలలా కరిగిపోవాల్సిన లలితగారి జీవితం ఒక సుస్థిరత సంపాదించుకున్నందుకుఇవాళ నా కెంతో హాయిగా వుంది'' అన్నాడురాంబాబు.

లలితా, నీరజా ఆశ్చర్యపోయారు.

''మీ కెలా తెలుసు ?'' అంది నీరజ.

''ఉదయం మీరు వెళ్లి సత్యమూర్తిగారితో మాట్లాడిన తరువాత నేను వెళ్లాను చెప్పడానికి. కాస్సేపు సాహిత్య చర్చ జరిగిన తరువాత, శరత్ నవలలో పాత్రలమీదకు మా ప్రసంగం మారింది. సంస్కారం గల వ్యక్తులు, స్త్రీ పురుషుల మధ్య సమతా సిద్ధాంతాల్ని ప్రతిపాదించే వ్యక్తులూ, యుగ సంధిలో ఎదురయ్యే విపరీతాల్ని ఎదుర్కోవాలన్న, మంచి అభిప్రాయంతో యేకీభవించాం. సత్యమూర్తి ఎంత ఆవేశంగా మాట్లాడినా, దాని వెనుక ఎంతో పట్టుదల, తీవ్రమైన ఆలోచన విధానం గల విశిష్టమైన వ్యక్తిత్వం గల మనిషిలా కన్పించాడు. మాటల మధ్యలో లలిత గురించి మీరు చెప్పారని, లలితను పెండ్లి చేసుకోవాలని నిశ్చయించుకున్నానని చెప్పాడు. అప్పుడు నేను ఆశ్చర్యపోయాను. లలితగారి అమాయకత్వం గురించి, వివరించి, లలాంటి నిర్ణయం తీసుకున్నందుకు ఆయన్ని మనసారా అభినందించాను'' అన్నాడు గర్వంగా రాంబాబు.

(ఇంకా వుంది)

# దిట్టమైన జత
# అన్ని కాలాలకు పాదరక్ష



# TROT®
## ట్రాట్-ప్లాట్‌ఫామ్

| | | | |
|---|---|---|---|
| మగవారివి | 7 - 10 | రూ. | 16.50 |
| ఆడవారివి | 2 - 6 | రూ. | 15.25 |
| పిల్లలవి | 9 - 1 | రూ | 10.75 |

స్థానిక పన్నులు అదనము



# TROT®
## ట్రాట్-కుషన్

| | | | |
|---|---|---|---|
| జయింట్స్ | 11 & 12 | రూ. | 14.50 |
| మగవారివి | 7 - 10 | రూ | 12.99 |
| ఆడవారివి | 2 - 6 | రూ. | 11.99 |
| పిల్లలవి | 9 - 1 | రూ | 9.95 |
| శిశువులవి | 6 - 8 | రూ. | 8.30 |

స్థానిక పన్నులు అదనము

**అదనపు మెత్తదనము మరియు సౌకర్యము**

Grant. DRP. 10Tel

గతిశీలురైన "డైనమిక్" వారివద్ద ఎన్నెన్నో క్రొత్త క్రొత్తవి ఉన్నాయి మీకు

ట్రాట్ ట్రేడ్‌మార్క్ స్వంతదారు:
ట్రాట్ షూ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్
19/4ఎ, మున్షీగంజ్ రోడ్, కిద్దర్‌పూర్, కలకత్తా-700 023

తయారీ లైసెన్స్ పొందినవారు:
DRP
డైనమిక్ రబ్బర్ అండ్ ప్లాస్టిక్ ప్రైవేట్ లిమిటెడ్
వైట్‌ఫీల్డ్ రోడ్, మహాదేవపుర పోస్ట్, బెంగళూరు-560 048

# గతి

మహీధర రామశాస్త్రి



**వెన్నెట్లో కోనసీమ కొబ్బరిచెట్లు వెండి గొడుగుల్లా మెరుస్తున్నాయి. ఆ కొబ్బరి చెట్ల నీడల్లో ప్రశాంతంగా, ఆహ్లాదంగా వుంది వూరు !**

ఆ ప్రశాంత వాతావరణంలో అపశృతిలా వెంకటప్పయ్య వెర్రిగా అరుస్తున్నాడు. అతని అరుపులు చికాకుని కలిగిస్తున్నాయి.

అంతలోనే —

''చచ్చిపోయాన్రోయ్ ! కొట్టి చంపెయ్యకు రోయ్ !'' అంటూ ఏడుపు.

ఆ గొంతు వెంకటప్పయ్య ముసలితల్లి ప్రభావతమ్మది. మొగుడు బతికున్న రోజుల్లో ప్రభావతమ్మ జీవితంలో ఓ ప్రభ వెలిగింది. మొగుడు పోయి, భోగభాగ్యాలు పోయి అన్నీపోయి, చివరికి యీ దోసెడు కొంప, మతిలేని కొడుకు, కోడలుతో చివరి రోజులు వెళ్లమారుస్తోంది ప్రభావతమ్మ !

ఉపవాసాలు చెయ్యలేక, చావుదెబ్బలు పడలేక, యీసరికి ఆ గుక్కెడు ప్రాణం పోయివుండాల్సిందే! కాని, ఆమె రక్తంలో జీర్ణించుకుపోయిన ఓ కోరిక ప్రభావతమ్మ ప్రాణాన్ని నిలబెట్టుకుంటూ వస్తోంది !

ఏవిటా కోరిక ?

కాశీ వెళ్లిరావాలని !

*　　*　　*

''అమ్మా ! ఆకలే ! అన్నం పెట్టవే !'' అని దీర్ఘాలు తీస్తున్న ప్రభావతికి తల్లి నచ్చజెప్తోంది.

''ఉండమ్మా ! మగవాళ్ల భోజనాలు అయిపోతున్నాయి ! మీ నాన్నగారు వచ్చేక మనం వెడదాం ! సోవప్పగారింట యీవేళ కాశీ సంతర్పణ కదా ! కాస్త ఆలశ్యం అయినా ఓర్చుకోవాలి మరి ! ''

''కాశీ సంతర్పణంటే ఏవిటే ?''

''అంటే — కాశీ వెళ్లివచ్చినవాళ్లు ఊరంతా భోజనాలకి పిలిచి సంతర్పణ చేస్తారు ! మనవంతా వాళ్లింట్లో భోజనాలు చేస్తాం !''

''అమ్మబాబోయ్ ! ఊరంతానా ?''

''ఆ ! వూరంతా !''

''మన వూళ్లో ఎంతమంది జనం వున్నారో అంతమందికీ భోజనం పెడతారా ?''

''ఆ ! అంతమందికీ !''

''మన చాకలి సోమాలూ వస్తుందా ?''

''అది రాదు ! దానికి యింటికి యిస్తారు. పట్టుకుపోయి తింటుంది !''

''మనకి బండి కట్టే వెంకన్న వస్తాడా ?''

''బాగుందే ! నీ ప్రశ్నలూ నువ్వూనూ ! వాళ్లంతా ఎందుకు ? వాళ్లని పిలవరు !''

''మరి వూరంతా అన్నావ్ ?''

''ఊరంతా అంటే, మన బ్రాహ్మలంతాను !''

ప్రభావతి పట్టుపరికిణీ కట్టుకుని, తల్లితో భోజనానికి వెళ్లింది --

అక్కడ —

మంగళ వాయిద్యాలు మోగుతున్నాయి. సోవప్పగారూ, భార్యా పట్టుబట్టల్లో మెరిసిపోతున్నారు. భోజనాలు బాగున్నాయి. అదో పెళ్లిలా కనిపించింది చిన్న ప్రభావతికి.

తాంబూలం తీసుకుని వస్తున్న తల్లికొంగు పట్టుకుని, ఇంటికి వస్తూ — ''అమ్మా మనం ఎప్పుడు వెడదామే కాశీ ?'' అని అడిగింది ప్రభావతి.

''బాగుందమ్మా నీ ప్రశ్న ! దగ్గరా దాపులా ? దానికి బోలెడు డబ్బు కావాలి. అంతకు మించి ఒంటిమీద ఆ యోగం వుండాలి. కాశీ అంటే మాటలా ? మూటలు పట్టుకుంటే అవుతుంది ! పెళ్లయి పెద్దదానివయితే, నీ మొగుడూ నువ్వూ వెడుదురుగాని కాశీ !'' అందా తల్లి.

ప్రభావతి పెళ్లికోసం ఎదురు చూసింది.

*　　*　　*

ఎదురు చూడగా చూడగా, ప్రభావతికి పెళ్లి అయింది. మంచి సాంప్రదాయ కుటుంబవనీ, ఆస్తిపాస్తులున్న వాళ్లనీ, తన మావగారు మూడుసార్లు కాశీ నడిచి వెళ్లి వచ్చాడనీ, అంతా గొప్పగా చెప్పకుంటూంటే — ప్రభావతి ఎంతో గర్వపడింది ! అంతకన్నా ఎక్కువ సంతోష పడింది — కనీసం తన భర్త ఒక్కసారన్నా కాశీ వెళ్లడా? వెడుతూ తననూ తీసుకువెళ్లడా అని !

ఔపోసన నాటిరాత్రి భర్త తనని దగ్గరగా తీసుకుని, ముద్దుపెట్టుకుని సిగ్గును వదిలించాక, మొదటిసారిగా తన కోరికను భర్తకు చెప్పకుంది.

''ఏవండీ! మనం కాశీ ఎప్పుడు వెడదావండీ?''

''అదేవిటే ? పిచ్చిదానా ! కాపురానికయినా రాలేదు ! కార్యం నాటిరాత్రే కాశీ అంటావేవిటి ? ఎన్ని కథలూ; కార్యాలూ అవాలి ? కాటికిపోయే ముందు కాశీ వెళ్లొద్దాంలే ! అంతవరకూ పిచ్చి పిచ్చిగా వాక్కు ! రా ! నా దగ్గరగా కూర్చో ! నే చెప్పే కథలన్నీ విను ! నేను చెయ్యమన్నట్టల్లా చెయ్యి !'' అంటూ ప్రభావతి చేతిని తన చేతుల్లోకి తీసుకుని, ఎక్కడెక్కడికో తీసుకువెళ్లాడు భర్త.

ప్రభావతి ప్రభావతమ్మ అయింది. ప్రభావతమ్మ భర్త చెప్పే కథలన్నీ వింది. చెయ్యమన్నట్టల్లా చేసింది. రత్నాల్లాంటి ఆరుగురు ఆడపిల్లల్నీ ముత్యాల్లాంటి ముగ్గురు మగపిల్లల్నీ కంది. సంసారం నడపడానికి, ఆడపిల్లల పెళ్లిళ్లు చెయ్యడానికి, తన ఒంటిమీద నగా నట్రా ఒల్చుకుపోయి, ఆఖరికి ఓ నాడు — ''ఈ సంతతే నీ సంపద !'' అని వప్పజెప్పి తను కాటికిపోయాడు ! కాశీకి తీసుకువెళ్లలేదని ఏడ్చింది ప్రభావతమ్మ.

అలా ఏడుస్తూనే వుంది అప్పట్నుంచి. చిన్న కొడుకులిద్దరూ ఉద్యోగాలు వెతుక్కుంటూ రెక్కలు కట్టుకుపోయారు. వెంకటప్పయ్య దగ్గర ప్రభావతమ్మ రోజులు గడుపుకుంటూంది. ఆవిడ ఆశ ఏవిటి ? ఎప్పుడో ఓ రోజున చిన్నకొడుకు దొరబాబులా వచ్చి తనను కాశీకి తీసుకువెడతాడని !

ఆ మాట ఏమోగాని, వెంకటప్పయ్య మాత్రం వెన్ను పూస విరిగేలా తన్నుతూంటాడు. కోడలు పట్టకారుపెట్టి తొడపాయసాలు పెడుతూవుంటుంది. అట్లకాడతో గోళ్లూడకొడుతూ వుంటుంది. ఎవరూ పట్టించుకోరు. పట్టించుకోనూలేరు !

*　　*　　*

వెంకటప్పయ్య పిచ్చాడు కాదు ! పిల్లల్ని కొడుతున్నాడు — పిల్లలకి పాఠాలు చెపుతున్నాడు; టీచరుగా పనిచేస్తున్నాడు. అయితే — మనిషి కొంత తిక్క, మరికొంత పెంకితనం లేకపోలేదు.

ఓమారు సెంటర్ క్లాస్‌లో పాఠం చెప్పాల్సిన వంతు వెంకటప్పయ్యమీద పడింది. వచ్చిన అధికారి స్త్రీ !

''అంగన నమ్మరాదు !'' అన్న పద్యం చెప్పి అర్థ తాత్పర్యాలు చెప్పడం మొదలుపెట్టాడు !

ఆ అధికారిణి మండిపోయి, ''మగవారిని

# బ్రూక్ బాండ్
# గ్రీన్ లేబిల్

## మంచి రుచికి ఎల్లప్పుడూ నమ్మవచ్చును

గ్రీన్ లేబిల్ యొక్క రుచి మీరు దీనిని కొన్ని సంవత్సరంలుగా ఇష్టపడేలా చేసింది. సువాసన మరియు సంతృప్తి నిస్తుంది.

## మీ కుటుంబ సాంప్రదాయకంగా వచ్చిన రుచి

Brooke Bond
Green Label
Blend of Coffee & Chicory

Blend of Coffee & Chicory
Coffee 53% Chicory 47%

Brooke Bond India Limited

Contents : Blend of Coffee & Chicory
Net weight 500 g
Month & Year Packed
Code No.
Max. Price
(Local taxes extra)

OBM-6306A1 TEL

సమ్మవచ్చా మేస్టారూ ?'' అని అడిగింది. ఆ తర్వాత వెంకటప్పయ్యకి శంకరగిరికి బదిలీ జరిగింది ! వాళ్ల కడుపులూ వీళ్ల కాళ్ళూ పట్టుకుని ఏడిస్తే — ఏడాదికిగాని మళ్ళా గోదావరి, కొబ్బరిచెట్లూ దర్శనం కాలేదు !

మరోమారు —

బి. డి. వో ఆఫీసుకి వెళ్లి —

''జనరల్ ఫండులో ఖర్చు రాసుకుని నాకో రెండు వేలు అప్పు యివ్వండి ! నేను ఆర్థికంగా వెనకబడ్డవాణ్ణి ! కాదంటే ఇందిరమ్మకి రాస్తా !'' అన్నాడు.

''రాసుకో ! ఫో !'' అన్నాడు బిడివో.

అంతకన్న మరే చురక తగిలించకపోవడానికి కారణం — తనదగ్గర పనిచేస్తున్న హెడ్డుగుమాస్తా శంభుప్రసాద్‌కి వెంకటప్పయ్య అల్లుడు కావడమే కారణం.

''నాకీ వెధవ ఉద్యోగం అక్కర్లేదు !'' అని రిజైన్ కాగితం బిడివో ముఖాన కొట్టినా —

''నా కూతురూ పిల్లలూ నాశనం అయిపోతారు !'' అని శంభుప్రసాద్ బిడివోకి మొర పెట్టుకోబట్టే ఉద్యోగం నిలబడిన్నంది.

భార్యను చావగొట్టి యింట్లోంచి గెంటేస్తాడు వెంకటప్పయ్య. మూడునాళ్ల తర్వాత పిల్లల్ని వెంటబెట్టుకుని మళ్ళా వచ్చేస్తుంది. ఇద్దరికీ పడదు; షష్ఠాష్టకం పోరు.

''ఈ పీనుక్కి యీ పైత్యం ఎప్పుడు తగ్గుతుందిరా భగవంతుడా !'' రాగాలు తీస్తూ ఆలోచిస్తూంది ప్రభావతమ్మ అరుగుమీద కూర్చుని.

మళ్ళా యివతలకు వచ్చాడు వెంకటప్పయ్య.

''ఫో ! నా అరుగుమీంచి ఫో ! నా యింట్లో ఉండద్దు !'' అంటూ కాలితో తన్నేస్తున్నాడు.

''ఎక్కడికి పోతాన్రా యీ అర్ధరాత్రి ? నువ్వు చచ్చిపోనూ ! నీ అమ్మ కడుపు కాలా !''

ప్రభావతమ్మ తిట్టిపోస్తూంది.

''అవును ! నేను చచ్చిపోయినట్టే నీకు ! ఫో ! బయటకి ఫో !'' అంటూ ఆ ముసలి ప్రాణం రెక్క పట్టుకుని వీధిలో నడిపిస్తున్నాడు.

అందరూ వినోదంలా చూస్తున్నారే తప్ప ఒక్కళ్ళూ నోరు మెదపడం లేదు — నాలుగురోజుల క్రిందటి సంగతి గుర్తుకు వచ్చాక.

భార్య కాఫీతెచ్చి ఇచ్చిందిట. నువ్వు తాగేవా ? అని అడిగాట్ట. నా కప్పు లోపలుంది. మీరు తాగండి ! ఇది మీకు ! అందిట. ఆ కప్పు యిలాతే ! నేనది తాగుతా! ఇది నువ్వు తాగు! అన్నాట్ట! అబ్బే! వద్దు! అందిట భార్య. పోనీ ఇందులోంచి రెండు గుక్కలు తాగి ఇయ్యి ! అన్నాట్ట. మీది మీరు తాగండి! నాది నేను తాగుతా ! అందిట భార్య.

అలా వెడుతున్న కుక్కను పిల్చి తన కాఫీ తాగించాట్ట! ఆ కుక్క అసింటా వెళ్లి కక్కుకుందిట! అంతే!

''వెధవా! నన్ను చంపేద్దామని చూస్తున్నావా?'' అని జుట్టు పట్టుకుని గుంజి నడ్డిమీద తన్ను తూంటే—చూడలేక, వెంకట్రావయ్యగారు కలుగ జేసుకుని బుద్ధి చెప్పబోయారట.

అంతవాణ్ణి పట్టుకుని—''లంజకొడకా ! నువ్వు

## గ తి

అడ్డువస్తే నిన్ను చంపేస్తా !'' అంటూ కత్తి తీసుకు వచ్చాట్ట !

ఇది నాలుగురోజుల క్రిందటి భాగోతం.

ఇంక ఎవరు కలుగజేసుకుంటారు ? ఎవరికి కావాలి ?

జానకమ్మగారు మాత్రం చూస్తూ వూరుకోలేక ప్రభావతమ్మను తన ఇంట్లోకి తీసుకువెళ్ళింది. ఆ రాత్రికి తన ఇంట పడుకోబెట్టుకుంది.

తెల్లగా తెల్లవారింది.

ప్రభావతమ్మ మామూలుగా ఏమీ కానట్టే తన ఇంటికి వెళ్లిపోయింది. వెంకటప్పయ్య కూడా ఏమీ అనలేదు. ప్రశాంత వాతావరణం ఏర్పడింది.

* * *

మళ్ళా ఓనాడు గావుకేకలు; పెడబొబ్బలు, ఏడుపులు! ముక్కు చీదుకుంటూ ప్రభావతమ్మ వీధినపడింది. ఈసారి వీధినపోయే ప్రతీవాడిని ఆపి, పితూరీ చేసింది; కోడలు తనకి అన్నం పెట్టడం లేదని !

ఈసారి కలగజేసుకున్నారు జనం ! అవును మరి; రేపటినుంచి అందరి ఇళ్లమీదా పడుతుంది— 'అది కావాలి; యిది కావాలి' అంటూ.




ఫలితంగా—ప్రభావతమ్మ ఆ ఇంట్లోనే వీధి గదిలో వేరేగా వుంటూ, వండుకుతినడం, వెంకటప్పయ్య రసవర్గాలు యివ్వడం — ఇలా వప్పందం కుదిరింది ! పెద్దముండ కదాని జాలివేత ఆవిడకి ఆ వున్న ఒక్క కిరసనాయిలు స్టవూ ఇప్పించారు. తడికమ్మలు, డొక్కలతో ఎక్కడ కుస్తీ పడుతుంది మరి ?!

ఓ రోజు కిరసనాయిలు అయిపోయింది. లీటరు అయిదూ, ఆరూ యిచ్చినా దొరకడంలేదు ! నా మాట ఏమిటంది ప్రభావతమ్మ.

''నాకేం తెలీదు! చావు!'' అన్నాడు వెంకటప్పయ్య! ఎక్కడికిపోయి ఛస్తుంది ? చచ్చినా దొరకడం లేదు కిరసనాయిలు !

''పోనీ రెండు కమ్మలయినా తగిలెయ్యి !'' అని బతిమాలింది ప్రభావతమ్మ.

''మాటంటే మాటే ! కమ్మలు డొక్కలు ముట్టుకుంటే డొక్కలో తన్నేస్తా ! డబ్బులు డబ్బా పట్టుకుని లైనులో నిలబడు ! కిరసనాయిలు రేషను షాపునుంచి తెచ్చుకో ! ఫో!'' అన్నాడు వెంకటప్పయ్య.

అక్కడా కిరసనాయిలు దొరక్కపోగా —

ఆ డబ్బులు పెట్టి హోటల్లో ఇడ్డెన్లు కొనుక్కుని తినడం మొదలుపెట్టింది, ప్రభావతమ్మ.

హోటలువాడి కారంపచ్చడి, అల్లంపచ్చడి, కారప్పొడి పడక, కడుపు పాడయింది. అజీర్తిరోగం పట్టుకుంది ప్రభావతమ్మకి. చెంబు నేలమీద పెట్టడంలేదు. ఎప్పుడూ చేతిలోనే వుంటూంది ! ఎప్పుడూ ఏటి పల్లంలోనే కూర్చుంటూంది !

వెంకటప్పయ్య మాటమీద నిలబడే మనిషి కాబట్టి ఇవేమీ పట్టించుకోలేదు ! పైగా —

''హైదరాబాదో, ఢిల్లీయో ఫో! కిరసనాయిలు దొరక్క అన్నంలేక మాడి ఛస్తున్నా అని చెప్పుకో ! ఫో !'' అని సలహా యిచ్చాడు.

కూర్చుంటే లేవలేకపోతున్న, అన్నం లేక హైరానపడిపోతున్న ప్రభావతమ్మ హైదరాబాదు ఏం వెడుతుంది ?!

* * *

భళ్లున తెల్లవారలేదింకా; వెంకటప్పయ్య భార్య గొల్లుమంది ! ఆ గోలలో అత్తగారి గుణవర్ణన కొనసాగుతూంటే, యిరుగూ పొరుగూ ఓ చెవి అటు పారేశారు. తెలిసిందేమిటయ్యా అంటే —

'ప్రభావతమ్మ గో హైట్ !'

ప్రభావతమ్మ బాల్చీ తన్నేసిందని !

వెంకటప్పయ్య తల్లి కోసం వెర్రిగా యేడ్చాడు.

దహనం అయింది కానీ దొరబాబుల్లాంటి యిద్దరు చిన్న కొడుకులు రాలేదు !

''మొత్తం కర్మ అంతా మీరెందుకు చెయ్యాలి ?'' అని వెంకటప్పయ్య భార్య నెత్తి మొత్తుకుని నచ్చజెప్పినా వెంకటప్పయ్యే వినిపించుకోలేదు !

ఏ మాటకామాటే చెప్పుకోవాలి !

కర్మ చాలా భారీగా చేశాడు !

గోదానానికి జర్సీ ఆవుని కొన్నాడు. సువర్ణ దానానికి వేలినున్న వుంగరం యిచ్చేశాడు. పాతర సామాను అమ్మాల్సి వచ్చినా వెనుకాడలేదు - వూరంతా సంతర్పణ చేసాడు తల్లి శ్రాద్ధానికి !

పాపం — వెంకటప్పయ్య భార్య —

''రేపటినుంచి మన గతి యేమిటండీ ?'' అని అడుగుతూనే వుంది.

''ఆవిడ ఉత్తరగతులు మాటేమిటి ?'' టప్పాయించి అడిగేడు వెంకటప్పయ్య.

పన్నెండో రోజు అయిపోయాక —

ఓనాడు వెంకటప్పయ్య వాకింటబట్టలు సర్దుకుంటున్నాడు. బెడ్డింగులా బొంతల్నీ, దుప్పట్లనీ మట్టుకుంటున్నాడు. తెగ హడావుడి పడిపోతున్నాడు ప్రయాణ సన్నాహంతో !

''ఎక్కడికండీ ప్రయాణం ?''

''అడిగేవు ? కాశీపోతున్నా ! అమ్మ అస్తికలు గంగలో కలిపేసి వస్తా !''

''అంత దూరం ఎందుకండీ ? మన వైనతేయంలో కలపకూడదూ ? అంత డబ్బెక్కడిదీ మనకి ?''

''నువ్వేం అడ్డుచెప్పకు ! డబ్బుకి లోటేం లేదు ! పి. ఎఫ్. లోను పెట్టాను. కాపరా వస్తూనే 'కాశీయో' అంటూ అడుగు పెట్టిందిట ఆవిడ ఈ యింట్లో ! నాన్న చెప్తూండేవారు ! డబ్బుకోసం ఆలోచించి, గంగలో కలపాల్సిన అస్తికలు గోదాట్లో కలుపుతానా ?!''

అంటూ నడుం పట్టుకుని నిలబడిపోయాడు వెంకటప్పయ్య. 

# క్రొత్త
# సంసార్
## డిటర్జెంట్ ఉతికే పౌడర్




గరిష్ఠ
కొనుగోలు ధర
రూ 12·50
(స్థానిక పన్నులు అదనము)

ప్రత్యేక పరిచయాత్మకం:
1 కేజి ప్యాక్‌కి రూ. 9-50
ఈ పోటీలో పాల్గొనండి
విశేష డిస్కౌంట్ కూపన్‌ను గెలవండి.

# "వ్యత్యాసమేమి?" పోటీలో పాల్గొనండి

అన్ని సమాధానములు సరిగ్గా ఉన్న మొదటి 15,000 ప్రవేశ పత్రాలకు విశేష డిస్కౌంట్ కూపన్‌లు లభిస్తాయి

పాలిప్యాక్‌లో లభించే క్రొత్త సంసార్ డిటర్జెంట్ ఉతికే పౌడరు అమ్మకం ధర కే.జి.కి రూ. 12.50 (పన్నులు అదనము). కాని 'ప్రత్యేక పరిచయాత్మకం' ద్వారా మీరు సంసార్‌ను రూ. 9.50 కే (పన్నులు అదనము) పొందవచ్చును. మీరు చేయవలసిందల్లా ఈ పోటీలో పాల్గొని డిస్కౌంట్ కూపన్‌ను పొందటమే! ఈ ఉత్తమ సంసార్ డిటర్జెంట్ మీ సొమ్ముకి సరిపడు గుణాన్ని కల్గివుందని మీరే నిర్ణయించండి.

క్రింది ప్రశ్నకు మీ సమాధానము వ్రాయండి.
సంసార్ పాలిప్యాక్ మీద ఎన్నిరంగులు కలవు ?

పోటీ చాలా సులభం
ప్రవేశ రుసుము లేదు.







పైన చూపిన రెండు ప్యాక్‌ల మధ్య 6 తేడాలు కలవు. ప్యాక్ 'ఎ' మాత్రమే సరియైన ప్యాక్. ప్యాక్ 'బి' మీద తప్పులను ఎంచి చుట్టూ వృత్తాకారం గీయండి. ఈ ప్రవేశ పత్రాన్ని కత్తిరించి, మీ పేరు మరియు విలాసమును ప్రత్యేక కాగితంమీద వ్రాసి క్రింద పేర్కొన్న చిరునామాకు పంపించండి.

'వ్యత్యాసమేమి' పోటీ, మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్
36, కన్నింగ్‌హ్యామ్ రోడ్డు, బెంగళూరు–560052.

న్యాయ నిర్ణేతల తీర్పు తుదినిర్ణయము మరియు దీనికి సంబంధించిన ఏ విధమయిన ఉత్తర ప్రత్యుత్తరములకు అవకాశము ఇవ్వబడదు.
ప్రతి కుటుంబానికి ఒకే ప్రవేశ పత్రము.

త్వర పడండి
ఈ రోజే పాల్గొనండి.

ASVP

కర్నాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగళూరు వారి ఒక నాణ్యమైన ఉత్పాదన.
మార్కెట్ చేయువారు : Ⓜ మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగళూరు

MCA-SDP-101 TEL



## ప్రణయగీతంలో పంచాయతి తీర్పు

రచ్చబండ... ప్రెసిడెంట్ (గుమ్మడి) కొడుకు చినబాబు (చంద్రమోహన్) మీద పంచాయతీలో కొందరు నేరారోపణ చేశారు. అందులో నిజం ఎంత ఉందో వాళ్ళ అంతరాత్మలకే తెలుసు.

''మొన్నటికి మొన్నేమో — నా కుక్కపిల్ల విషయంలో నానా గొడవా చేశాడు. ఇప్పుడేమో వాళ్ళందర్నీ చావగొట్టేశాడు. ప్రెసిడెంటు గారబ్బాయనే ధీమాతో ఇష్టం వచ్చినట్లు చేస్తున్నాడు. ఇలా చేస్తూవుంటే మేమందరం ఊరుకోవలసిందేనా ?'' అన్నాడు మీసాల వెంకయ్య.

ప్రెసిడెంటు సూటిగా చినబాబు కళ్ళల్లోకి చూశాడు. ''వేళాకోళం చేసినా, ఏడిపించినా పంచాయతీలో ఫిర్యాదు చెయ్యాలి. నీ యంతటికి నువ్వు చెయ్యి చేసుకోవడం తప్పు. చేసిన తప్పుకి నలుగురి కాళ్ళమీదా పడి క్షమాపణ చెప్పుకో.''

చినబాబు తల వంచుకున్నాడు.

''చెప్పవా ? నువ్వు క్షమాపణ చెప్పకపోతే — నీ తండ్రిగా కాకుండా, ఈ ఊరు ప్రెసిడెంటుగా నిన్ను కఠినంగా శిక్షించవలసి ఉంటుంది... ఏమంటావ్ ? సరే... రేయ్ ! ఆలయంలో ఉన్న చాప, దిండు పట్టండి... ఇవాల్టినుంచి ఏడు రోజుల పాటు నువ్వీ గ్రామంలో ఉండడానికి వీల్లేదు. ఏరు దాటి బయటికి వెళ్ళాలి. ఈ ఊళ్ళో వాళ్ళెవళ్ళూ ఇతనితో ఏ విధమైన సంబంధాలూ పెట్టుకోడానికి వీల్లేదు. ఎనిమిదో రోజు సూర్యోదయం తర్వాతనే మళ్ళీ నువ్వు ఈ ఊళ్ళో కాలు పెట్టాలి... సుబ్బన్నా, యెంకన్నా ! వీడ్ని తీసుకెళ్ళి ఏరు దాటించి రండి,'' అంటూ ప్రెసిడెంటు హుకుం జారీ చేశాడు.

చినబాబు, తండ్రి పాదాలకు నమస్కరించి, తను ఎంతగానో అభిమానించే బేబీ దగ్గరికి వెళ్ళాడు. బేబీకి ఒక్కసారిగా దుఃఖం ముంచుకొచ్చింది. ''అంకుల్ ! నేనూ నీతో వచ్చేస్తానంకుల్ ! ఈ ఊళ్ళో అందరూ చెడ్డవాళ్ళు, అంకుల్ ! నెను నీదగ్గరే ఉంటానంకుల్ ! నేనూ నీతో వచ్చేస్తానంకుల్ ! అంకుల్ !''

బేబీని ఆప్యాయంగా దగ్గరికి తీసుకొని ఓదార్చాక చినబాబు ఖిన్నవదనంతో ఊరు విడిచి వెళ్ళిపోయాడు.

## 'ఏది ధర్మం — ఏది న్యాయం'లా మాధవి

## సినిమా

మే నెలలో విడుదలయ్యే డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ ''ప్రణయగీతం'' లో సుజాత, నూతన్‌ప్రసాద్, రవికాంత్, మురుగన్, ప్రశాంత్‌కుమార్, భీమరాజు, చిట్టిబాబు, ధమ్, సత్యకళ, జయవాణి, బేబీ కాంచన వగైరా తారాగణం. పి. సాంబశివరావు దర్శకత్వంలో డి. వి. ఎస్. రాజు నిర్మాత.

## భానోదయా ఫిలిమ్స్

జి. రామమోహన్‌రావు దర్శకత్వంలో వై. మాధవయ్య నిర్మించే చిత్రంలో సత్యనారాయణ, జానకి ముఖ్య భూమికలు నిర్వహిస్తారు.

## రిజిష్టర్ చేయబడిన టైటిల్స్

ఎ. వి ఎం. మురుగన్ అండ్ కో ''మన ఊరి కృష్ణ'', ఆదిశక్తిచిత్ర ''చూడ చక్కని వాడు'', శ్రీ భీమేశ్వర కంబైన్స్ ''శివభక్తుడు'', శ్రీ రత్నా ఇంటర్నేషనల్ ''హనీమూన్'', గోగినేని చిత్ర ''కాలజ్ఞాని'', ఆర్. ఆర్. ప్రొడక్షన్స్ ''రాము—సోము'', కృష్ణప్రసాద్ మూవీ క్రియేషన్స్ ''కరుణాసాగర్'', మధు క్రియేషన్స్ ''రాజనర్తకి'', శ్రీ క్రాంతి చిత్ర ''భారతి'', సురేష్ ప్రొడక్షన్స్ ''దేశం కోసం'', రోస్ సినీ క్రియేషన్స్ ''మారాలి యువతరం'', శ్రీ సిద్ధార్థ ఫిలిమ్స్ ''న్యాయం కోసమా'', శ్రీ క్రాంతి చిత్ర ''న్యాయం కావాలి'', జాన్ పాక్ ఇంటర్నేషనల్ ''పెళ్ళిచూపులు'', రైన్‌బో సినీ ఆర్ట్స్ ''పట్నం పిచ్చి'', భారతీ ఆర్ట్ పిక్చర్స్ ''పొద్దు పొడిచింది'', శ్రీ కృష్ణా మూవీస్ ''రక్తదాహం'', అన్నపూర్ణా మూవీ క్రియేషన్స్ ''జ్వాల'', విద్యావతి ఎంటర్‌ప్రైసెస్ ''మరో లవకుశ''.

'గడసరి అత్త – సొగసరి కోడలు'లో శ్రీదేవి, భానుమతి

## సినిమా

### విహ్వారి చిట్టిబాబు

"ఒకే షెడ్యూల్లో ఏప్రిల్ 25కు పూర్తవుతుంది," అన్నారు ఎన్. గోపాలకృష్ణ. ఈయన దర్శకత్వంలో కె. వెంకటనారాయణగుప్త నిర్మించే అమర్ ఆర్ట్స్ ఇంటర్నేషనల్స్‌వారి పై చిత్రం ఉగాదినాడు భాగ్యనగర్ స్టూడియోలో సెట్స్‌కు వెళ్లింది. దీనికి హిందీ "ఆక్రికత్" చిత్రం పునాది. కవిత, మమత, పి. ఎల్. నారాయణ, పి. జె. శర్మ, కొత్త నటుడు సుదర్శన్ వగైరా తారా సందోహం. చేతన్ ఆనంద్ కథకు చెరువు ఆంజనేయశాస్త్రి మాటలు రాశారు. సి. నారాయణరెడ్డి, ఆరుద్ర జాలాది, గోపి గీతాలకు రోహిణీ చంద్ర సంగీత మిచ్చారు. పి. జె. సెల్వం, వి. కృష్ణమూర్తి, కె. సత్యం, ఎస్. మోహన్‌కుమార్ ఛాయ, శిల్పం, కూర్పు, సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

## కె. బాలచందర్




అందమైన సాయంకాలం...
ఇది క్యాంపా సమయం అది ఎంతో మధురం
Campa
Campa
Campa Cola
Campa
Campa
Campa Cola
క్యాంపా
లెమన్ ఆరెంజ్ కోలా
ఉరవళ్లు త్రొక్కే ఉల్లాసపానీయం క్యాంపా
KIRON /C/81/1

# అప్సరా మరియు నటరాజ్ పిక్చర్ పెన్సిల్స్

## రంగురంగుల డిజైన్లలోని అందం
## చేతిలో ఇంద్రధనస్సులాంటి మురిపెం.




**అప్సరా** మరియు **నటరాజ్** పిక్చర్ పెన్సిల్స్

ఎక్కువ కాలం పనిచేసే పెన్సిళ్ళు

హిందూస్థాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్ 79 పాల్టన్ రోడ్, బొంబాయి 400 001.

OBM/5755 TL



'జేగంటలు'లో రాళ్లపల్లి, రమాప్రభ

## ఊరికిచ్చిన మాటలో మాట తప్పిన కోటి

డిస్కో డాన్స్ చేస్తున్న రూప (మాధవి) అప్రయత్నంగా గుమ్మం దగ్గర నిలుచున్న రాముడ్ని (చిరంజీవి) చూసి, ఆగింది. "ఎవరు నువ్వు? ఏయ్, గబ్బిలాయిలా చూస్తున్నావ్? ఏం కావాలి?" అంది. ఇంతలో ఆమె తండ్రి ప్రతాపరావు (కాంతారావు)అక్కడికి వస్తూ, "రూపా ఎవరమ్మా ఇతను ?" అడిగాడు.

"కోటి కోసం వచ్చానండి. నేను కోటి అన్నయ్యనండి," అన్నాడు రాముడు.

ప్రతాపరావు నివ్వెరపోయినా, తాపీగా "అటువంటి మనిషి ఇక్కడెవరూ లేరే !" అంటూండగానే కోటి(సుధాకర్)పక్క గదిలోంచి వచ్చాడు "రూపా, రూపా !" అంటూ.

రాముడికి ఆశ్చర్యం, ఆగ్రహం ఒక్కసారిగా కలిగాయి. "ఒరే కోటీ, లోపలున్నావ్రటా ?" అంటూ ప్రతాపరావు వంకతిరిగి, "ఏమయ్యా, పెద్దమనిషీ ! లోపలుంటే లేడని అబద్ధం చెబుతావేం ? అసలు యీళ్ళింట్లో యెందుకుంటు న్నావురా ? యెవరు వీళ్ళు ?" అన్నాడు తమ్ముడ్ని ఉద్దేశించి.

"నేను చెబుతాను. కోటి ఈ ఇంటి అల్లుడు," అన్నాడు ప్రతాపరావు.

"ఏరా, కోటీ ! వీళ్ళు చెప్పేది నిజమేనా ? అరే ! ముందుగా చెబితే నీ పెళ్ళి మనూళ్ళో బ్రహ్మాండంగా జరిపించుండే వాళ్ళం కదరా ! సర్లే...జరిగిందేదో జరిగిపోయింది...రా, పోదాం," అన్నాడు రాముడు.

"నేను రానన్నయ్యా ! ఇక్కడే ఉంటానని వీళ్ళకి మాటిచ్చాను," అన్నాడు కోటి.

"వీళ్ళకు మాటిచ్చావా ? మరి మనూరికిచ్చిన మాటో ? డాక్టరై వచ్చి, మన ఊళ్ళోనే ఉండి అందరికీ వైద్యం చేస్తానని..." అన్నాడు రాముడు.

"ఎప్పుడో అన్న మాట పట్టుకొని ఊగులాడతావేమయ్యా ?" అన్నాడు ప్రతాపరావు.

"ఎప్పుడన్నా, ఎక్కడన్నా—మాట మాటేనండి. అసలు వీడి చదువుకు డబ్బెక్కడ నుంచి వచ్చిందో తెలుసాండీ ? మా ఊళ్ళో వాళ్ళంతా కలిసి, వొంటి మీదవి, ఇంట్లోవి – చెంబులు కంచాలతో సహా తెగనమ్మి వీడి చదువుకి డబ్బిచ్చారండి," అన్నాడు రాముడు.

"ఏ మాత్రం ఇచ్చారేమిటీ ! ఒక యాభై వేలు ఇచ్చుంటారా ? మేమిచ్చే డబ్బు పారేస్తే, ఏ డాక్టరైనా మీ ఊరు పరుగెత్తుకు వస్తాడు," అన్నాడు ప్రతాపరావు.

"నేనిప్పుడొచ్చింది వాడ్ని తీసుకెళ్ళడానికి ... తీసుకెళ్తాను," అంటూ కోటి చెయ్యి పట్టుకున్నాడు రాముడు.

"అన్నయ్యా, నేను రాను," అంటూ విదిలించుకోబోయాడు కోటి. "ఆగు !" అంటూ అడ్డుపడ్డాడు ప్రతాపరావు.

"నన్నాపటానికి మీ తరం కాదు గదా ఆ దేవుడి తరం కూడా కాదు," అంటూ తమ్ముడ్ని అమాంతంగా మోసుకొని బయలుదేరాడు రాము.

రూప, ప్రతాపరావు తెల్లబోయి చూస్తూండి పోయారు.

అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు నిర్మించే అమృతా ఫిలిమ్స్ "ఊరికిచ్చిన మాట" చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం నెఱపుతూ సమర్పించే ఎం. బాలయ్య "తూర్పు గోదావరి జిల్లాలోని అడ్డతీగలదగ్గర ఎర్రవరం గ్రామంలోనూ, మద్దిగట్ల రిజర్వాయర్ దగ్గర ఇటీవల జరిపిన షూటింగ్స్‌తో చిత్రం మూడు వంతులకు పైగా పూర్తయింది. ఏప్రిల్‌లో పూర్తిచేసి, మేలో రీరికార్డింగ్ జరిపి, జూన్‌లో విడుదల చేస్తాం," అని తెలిపారు. డి.వి. నరసరాజు సంభాషణలకర్త. ఎం. ఎస్. విశ్వనాథం సంగీత దర్శకుడు. ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రాహకుడు.

## శ్రీకర్ ప్రొడక్షన్స్

చిరంజీవి, లక్ష్మి నాయకా నాయికలుగా వి. సత్యనారాయణ నిర్మించే చిత్రానికి ఎస్. వి. చంద్రశేఖర్ దర్శకుడు.

## దాసరి – కృష్ణ

వై. సునీల్‌చౌదరి నిర్మించే సత్యనారాయణ పిక్చర్స్ ద్వితీయ చిత్రంలో కృష్ణ హీరో. దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వం నిర్వహిస్తారు.

'జీవిత రథం'లో శోభన్, జగ్గయ్య






ఆగండి..చూడండి..ఆలోచించండి.

నవతరం పిక్చర్స్

ఈస్ట్మన్ కలర్




సంగీతం చక్రవర్తి

నిర్మాత కె.రాధాకృష్ణ

దర్శకత్వం ధవళ సత్యం

నైజాం: శ్రీతారకరామా• సీడెడ్: నవయుగ పిక్చర్స్

VARAKAPRABHU ADS.

Bhaskar

# సమ్మర్

ఆర్. విశ్వనాథ్..
















నువ్వు మామూలు మృగానివి కావు.
చదువుకున్న మృగానివి.

నటరాజ ఆర్ట్ క్రియేషన్స్

# ఇల్లే స్వర్గం

కలర్

...త్వం: గొరసత్యనారాయణమూర్తి B.A.L.L.H.

నిర్మాతలు: డా|| సి. ఆంజనేయులు
దాసరిగోపాలకృష్ణ
శంభంగి అప్పారావు

ఎస్.ఎస్.ఎ.పి

TARAKAPRABHU ADS

---

నవత సినీ ఆర్ట్స్

# త్యాగయ్య

రచన: ముళ్ళపూడి వెంకటరమణ

సంగీతం సమర్పణ: కె.వి. మహదేవన్

దర్శకుడు: బాపు నిర్మాత: ఎస్. కృష్ణంరాజు

అన్నపూర్ణ

## సత్యం శివంలో శివుడి బిగువు

శివుడు (ఎన్. టి. ఆర్.) ఇంటిమీద కూర్చొని మందు కొడుతూ, "జగమే మాయ ... బ్రతుకే మాయ ... వేదాలలో...ఏం పాడాడురా బ్రదర్!" అంటూ కూనిరాగం తీస్తూండగా పార్వతి (శ్రీదేవి) కూరల సంచితో వచ్చింది. "ఏయ్, ఏమిటిది? అక్కడెందుకెక్కావ్?" అంది.

"కింద కూర్చొని తాగుతుంటే, గండుపిల్లిలా మీదపడి సీసా లాగేస్తావ్. అందుకని...ఫటాఫట్... కొంపలో కాకుండా కొంపమీద కూర్చున్నా."

"సరేలేగాని ... మంచి మాట చెబుతా. నేను సంతలోంచి వస్తూ పదిపైసలు ఇచ్చి చిలక జోస్యం చెప్పించుకున్నాను. ఆ చిలక తీసిన కాగితం లోపల ఏముందంటే – నేను కోరుకునేవాడ్ని త్వరలో పెళ్ళి చేసుకుంటానని ఉంది. అంటే—మనకి త్వరలోనే పెళ్ళి!"

"ఇదిగో ... ఆ, చిలక పిచ్చిదైనా అయి ఉండాలి. బాగా మందు కొట్టయినా ఉండి ఉండాలి. అందుకే ఎవరిదో కాగితం నీకు తీసింది. అసలు అది చిలక అయి ఉండదు. ఏ చెత్తపిట్టకో రంగువేసి ఉంటాడు. ఆ జోస్యాలేం నమ్మకు."

"ఇదిగో, మొగుడా! నన్ను పెళ్ళి చేసుకోనంటే నేను ఇవేళే చచ్చిపోతాను. సాయంత్రం అయిదు గంటలకు ఊరి చివరనున్న పీనుగుల వంతెనమీద నుంచి దూకి చచ్చిపోతాను."

"ఇదిగో, పిలకజడా! నీ చావు ప్రోగ్రాం అయిదు గంటలకయితే, నా బాటిల్ ప్రోగ్రాం ఆరు గంటల నుంచి పెట్టుకుంటాను."

"సరే—సరే...నిజంగానే చస్తా చూసుకో."

"ఇదిగో, జాగ్రత్త! చావడం ఎలాగంటే—గాలిలో చేతులు పైకి లేపి, కాళ్ళు బార్లా చాపి, శకుని పక్షిలా పైకి లేచి దూకాలి."

"నా చావు నే చస్తాను," అంటూ ఏడ్పుముఖం పెట్టుకొని పార్వతి వడివడిగా వెళ్ళిపోయింది.

ఎ. ఎన్. ఆర్., ఎన్. టి. ఆర్. నటించిన ఈశ్వరీ క్రియేషన్స్ "సత్యం–శివం" చిత్రం ఏప్రిల్ విడుదల. శ్రీదేవి, రతి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య, భానుచందర్, విజయశాంతి, పుష్పలత ఇతర తారాగణం. సత్యానంద్, చక్రవర్తి, రవి, వి. సత్యనారాయణరెడ్డి, కె. ఎస్. ప్రకాష్‌లతో కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో డి. వెంకటేశ్వరరావు నిర్మాత



సబితను 'సప్తపది'కి డైరెక్ట్ చేస్తున్న విశ్వనాథ్

## సినిమా

### 'కట్టా' దర్శకత్వంలో

కృష్ణ, జయప్రద నాయకా నాయికలుగా శ్రీ చరిత చిత్ర సమర్పణలో వి. ఎం. డి. ప్రొడక్షన్స్ సెప్టెంబర్ నుంచి మద్రాసులో ప్రారంభించే చిత్రానికి సత్యానంద్, వేటూరి, చక్రవర్తి పనిచేస్తారు. విష్ణుప్రసాద్ శర్మ నిర్మాత.

శోభన్‌బాబు హీరోగా తమ్మారెడ్డి కృష్ణమూర్తి సమర్పించే రవీంద్ర ఆర్ట్ క్రియేషన్స్ చిత్రానికి కె. వి. నారాయణరెడ్డి నిర్మాత.

మురళీమోహన్, చిరంజీవి, నూతన్‌ప్రసాద్‌లతో తమ్మారెడ్డి వి. కె. నిర్మించే చరిత చిత్ర కంబైన్స్ "పెళ్ళాడి చూడు" తొలి షెడ్యూల్ జూలై 15 నుంచి 30 వరకు, రెండవ షెడ్యూల్ ఆగస్ట్ 15 నుంచి 30 వరకు విజయవాడలో జరుగుతాయి. తోటకూర ఆశాలత కథకు వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, చంగయ్య ఛాయ తోడవులాయి. అక్టోబర్ 2 విడుదల.

చిరంజీవి, రాధిక ప్రధాన భూమికలు నిర్వహించే ఎస్. వి. ఎస్. ఫిలిమ్స్ చిత్రం షూటింగ్ మే, జూన్, జూలై మాసాలలో జరుగుతాయి. శ్రీమతి మిద్దె జగన్నాథరావు సమర్పణలో ఎం. చంద్రకుమార్ నిర్మాత.

(50 వ పేజీ చూడండి)

మురళీమోహన్ సమర్పించు






**మూడో అంతస్తు పడమటి వాటాలో కొత్తగా దిగిన జంటను చూసి తొలిరోజు యెదుటి వాటాలోనున్న సైన్‌టిస్టు పెళ్లాంతో అన్నాడు "ఆవిడ పిల్లల తల్లిలా కనిపిస్తోంది గానీ – యెవరూ పిల్లలున్నట్లులేరే."**

ఆ పెళ్లాం శోభారాణి తమ దిగువ వాటాలో నున్న ప్రేమించి పెళ్లి చేసుకున్న లిటరేచర్ యెమ్. ఏ. సూర్యకుమారితో అన్నది – "ఆవిడ బుర్రలో మట్టి తప్పించి యేమీలేనట్టుంది. ఆ చూపులు వెర్రిచూపుల్లా వున్నాయ్."

ఆ సూర్యకుమారి తమ ప్రక్కవాటాలోనున్న బాబా భక్తురాలు గిరిజాదేవితో ఒకరోజున "మీ నెత్తిమీది వాటాలో ఒక బుద్దు దిగింది తెలుసా ?" అంటే ఆవిడేమో దిగువ రెండువాటాల్లో వున్న యింటి యిల్లాలు ఇందుమతితో "ఎవరూ దొరక నట్టు చెవిటి మాలోకాన్ని మా నెత్తిన యెక్కించారేం ?" అని నిషూ్ఠరంగా అడిగింది.

వచ్చి వారంరోజులు కాలేదుగానీ ఒక పనిమనిషి అతగాడి కేకలు భరించలేక వుద్వాసన చెప్పింది.

"అతగాడు పులి ... ఆమె గోవు."

"ఆవిడ యెలిక – అతడు పిల్లి."

"పిల్లికాదు – ముంగిసలాంటి మూతివాడిది."

"నిజమే – ఆవిడవి పాముకళ్లే ... "

ఈ ఆడవాళ్లు అనుకున్న ఉపమానాలన్నీ కరెక్టు అని సంతోషించేటట్లు అతగాడు యింట్లో పెళ్లంమీద వేసిన కేకలు వీళ్లకు వినిపిస్తున్నాయ్.

గురువారం జరిగే బాబా భజనకు మూడు జంటలు ముచ్చటగా వచ్చారు. గిరిజాదేవి పట్టు చీరతో జిగజిగ మెరుస్తున్న నగలన్నీ చూపించు కుంటూ ఆహ్వానించింది. ఆడవాళ్లు నలుగురూ ఒకమూల నిల్చునే మాటలకు దిగారు. అన్నిటికీ నీ భర్త, నీ కూతురు, నీ రేడియోగ్రామ్, నా నైటీ- అంతా నాదే గొప్ప, నేనో యింటలెక్చ్యుయల్‌ని మా ఆయన గొప్ప చార్టెడ్ ఎకౌంటెంట్ అని ప్రతి వ్యాకం ముందు వుపోద్ఘాతంగా పలికే సూర్యకుమారి ఆ పెద్ద పారపళ్లన్నీ కనిపించేటట్లు నవ్వుతూ "మొన్నరాత్రి పదిగంటలకేం జరిగిందో తెలుసా ? ఎల్విస్ ప్రెస్లీ రికార్డు నా ఫారన్ రేడియోగ్రాంలో వేసుకుని వింటుంటే – ఎల్విస్ అంటే యెవరు ? కింగ్ ఆఫ్ రాక్–అండ్–రోల్‌గా ప్రపంచ ప్రసిద్ధి పొందాడు. బయట అంత చప్పుడేమిటా అని చూస్తే – పై రావణాసురుడు ఆ ట్యూన్‌కి డాన్సు చేస్తూ పాడుతున్నాడు. రానురాను రికార్డు కన్నా వాడి గొంతుకే మించడంతో రికార్డు ఆపేసాను – తాగి వచ్చాడేమో ?"

"ఆవిడ రూపురేఖలు భరించలేక బయట ఏ సెక్రటరీతోనో తిరుగుతున్నాడేమో?" శోభారాణి అంటే –

"ఆఫీసుకు వెళ్లడానికి టైమే – రాడానికి ఒక టైములేదు" గిరిజాదేవి అనగానే నేనెందుకు వూరుకోవాలని ఇందుమతి కళ్లద్దాలు సవరించు కుంటూ "కొద్దిగ సెమీక్రాక్‌లా వున్నాడు" అంది.

"కుమారీ – తెలీక అడుగుతున్నాను. ఏమీ అనుకోకు. అలాంటి క్రాక్ యింట్లో పని చెయ్యడానికి నీ పనిమనిషిని యెందుకు అనుమతించావ్ ?"

"మనం యిచ్చేదానికన్నా రెండింతలు యిస్తున్నాడట" శోభారాణి అంటే–

"నన్ను అడిగింది. నేను ఆలోచించకుండ ఏ పనీ చెయ్యను. సరే పని చెయ్యమన్నాను. ఒక్క వారం ఆగండి. వచ్చేవారం ప్రత్యేక భజన కార్యక్రమం తెల్లవారే వరకు వుందికదా! తెల్లవార్లూ చెప్పుకోడానికి సరిపడ్డంత వాళ్లవార్తలు మీకు వినిపిస్తాను. ఈ వార్తలు బి.బి.సి. వార్తలంత నిజంగా వుంటాయని హామీయిస్తున్నాను" సూర్యకుమారి హామీ విని "ఎంతయినా సూర్యకుమారి తెలివైనది" శోభారాణి పొగడ్తకు గిరిజాదేవి "అంత చదువుకున్నా కుమారికి బాబా అంటే భక్తి" అన్నది.

"అబ్బే! నాకు బాబాలమీద, భజనలమీద భక్తి లేదండి. నా డ్యూటీమీదే నా భక్తి. ఇక్కడకు వస్తే నాలుగు భోగట్టాలు తెలుస్తాయని ..." తేలిగ్గా సూర్యకుమారి అనగానే, కాస్త ముఖం ప్రక్కకు తిప్పి మూతి ముడుచుకుని "ప్రతివారం భజనకు వస్తుంటే కొడుకు పుట్టాలన్న కోరికతో వస్తున్నావనుకున్నాను" అంది గిరిజాదేవి.

"ఈ రోజుల్లో కూతురే బెస్టు. ఎందరు కొడుకులు తల్లీ, తండ్రిని దగ్గరకుచేరనిస్తున్నారు?" సూర్యకుమారి మాటలు ఇందుమతికి కమ్చీదెబ్బల్లా తగిలాయేమో ! ఆవిడ ఆ దళసరి కళ్లద్దాల చాటున వున్న కళ్లతో భీకరంగా చూస్తూ–

"అత్తలేని కోడలు వుత్తమురాలట! అత్తల్లూ, ఆడబడుచులూ లేని ఇంట సడ్డావ్ – నీకేం ?"

"ఈ చీర యెంత బావుందో ? ఎక్కడ కొన్నారు ?" ఇందుమతి చీరను తాకుతూ శోభారాణి అడిగింది.

"ఈవేళ నువ్వు పంపిన కూర చాలాబాగుంది. ఈసారి వండేటప్పుడు పిలుద్దూ–నేర్చుకుంటాను" ఇందుమతి అంటే సూర్యకుమారి "కొత్త ఫెమినాలో తంగం ఫిలిప్ సిమ్లామిర్చి పచ్చడి గురించి రాసింది. చదివి చేసాను. బ్రహ్మాండంగా వచ్చింది. మా వారు మళ్లీ చెయ్యమంటున్నారు."

ఇంతలో బాబా భక్తులు ఒక్కొక్కరూ చేరారు. భజన ఆరంభమైంది. పాపులర్ హిందీ ట్యూన్స్‌లో భజన పాటలు సాగుతుంటే "అవి ఫారన్ ట్యూన్స్. మనవాళ్లు కాపీ కొట్టార"ని తన పాశ్చాత్య సంగీత పరిచయాన్ని వెళ్లగక్కుతోంది సూర్యకుమారి.

"గిరిజాదేవి నగల వ్యాపారం చేస్తోందా ? బట్టల వ్యాపారం వుందా ?" గుసగుసలు.

"కాకపోతే అప్పుడే రెండు చీరలు మార్చింది."

"ఎన్ని నగలు వేసుకున్నా – ఎన్ని చీరలు మార్చినా ... ఆడాల్టా కండలు కరుడుగట్టి రాళ్లలా వ్రేలాడం మానటంలేదు ... " శోభారాణి తన ఒళ్ళు పొందికను చూసుకుని లోలోన మురిసిపోతూ అంది.

"ఇవన్నీ బాబా భజనలతో నాకు సంక్ర మించాయి. మీరూ చెయ్యండి. నాలా ఐశ్వర్యవంతు లవుతారని ... అంతా ఎడ్వర్టైజిమెంట్" అని సూర్యకుమారి అంటే –

"అటు చూడు. అన్ని యేసిలు పళ్లుండగా ప్రసాదానికి అటుకులు, బెల్లం కలుపుతోంది. అందుకే వజ్రాల దుద్దులు పెట్టుకుంది" ఇందుమతి అక్కసు వెళ్లగక్కింది.

# రుచులొలికే పానీయం చిటికలో తయార్!

చింత లేదు.
బెడద లేదు...

ఒక జగ్ నిండుగా నీటిలో ట్రింకా ప్యాకెట్‌లోని పొడరును పూర్తిగా వేయండి. తగినంత చక్కెరను కలపండి. బాగా కదపండి. క్షణంలో 5 గ్లాసుల ట్రింకా తయార్! రుచికరమైనది. ఆధునికమైనది. ఎంతో పొదుపైనది.

ఆఫీసు నుండి అలసి
ఇంటికి రాగానే
అబ్బో ఎంత మజా!

నారింజ, నిమ్మ, అనాస
ఈ మూడూ నాకిష్టమైన రుచులే!

ట్రింకా

ట్రింకా

ట్రింకా

TRINKA
from the makers of REX
Drink Mix
Flavour Orange
5 glasses
ADD SUGAR TO TASTE
Mfd by
CORN PRODUCTS CO. (INDIA) LTD.
Somani Marg, Bombay 400 001

ప్రపంచంలో అందరికీ
ఇది ఎంతో ప్రీతికరం.
మీకు తెలుసుగా!

ఇంత రుచికరమైన
పానీయం మునుపెన్నడూ
సేవించలేదు!

ట్రింకా

రసమయ ఉల్లాసాన్నిచ్చే
క్రొత్త విధానం.

ట్రింకా

REX రెక్స్ ఉత్పాదకుల నుండి REX రెక్స్ ఉత్పాదకుల నుండి REX రెక్స్ ఉత్పాదకుల నుండి REX రెక్స్ ఉత్పాదకుల నుండి

CASCP-4-244TL

## భ జ న

ఈ కులాసా కబుర్ల భజన యెటువంటి గందరగోళం లేకండా యీనాటికి ముగిసింది. ఎదురుచూస్తున్న వచ్చేవారం రానేవచ్చింది. తను తెలుసుకున్న విషయాలు యెంత వేగిరం కక్కుదామని ఆత్రుత పడుతున్న సూర్యకుమారి ముందుగనే వచ్చింది. ఆత్రుతపడినా అందరూ వచ్చేవరకు ఆగి తరవాత తను పనిచేస్తున్న కాలేజీలో లెక్చరిచ్చే పద్ధతిలో మొదలుపెట్టింది –

"మనం మన విషయాల గురించే తాపత్రయ పడకూడదు. ఈ భ వ నం లో యెనిమిదుగురు యిల్లాల్లున్నారు. అందులో కొత్తగా వచ్చిన ఇల్లాలి పేరు శశికళ. చందమామ సూర్యునిపై ఆధార పడినట్లు ఆవిడ ఆ అగ్గిబరాటా దగ్గర బానిసగా, హీనంగా బ్రతుకుతోంది. ఆవిడను రక్షించే బాధ్యత మన నలుగురిపై వుంది."

"ఏం చెప్పడానికి, చెయ్యడానికి ఎవరితోనన్నా కలవాలా ?" శోభారాణి అంటే –

"బాబా భజనచేస్తే ఆ కష్టాలు నివారణ అయ్యేవే. మేడదిగి వస్తేనా ?" గి రి జా దే వి విచారించింది.

"ఆవిడ కాబట్టి ఆ యముడ్ని భరిస్తోంది. నేనైతే మరుచటిరోజు విడాకులు తీసికొందును" సూర్యకుమారి కోపంతో కళ్లెర్రజేసింది.

"కొట్టున్నాడా ?" ఇందుమతి అడిగితే.

"పులి పంజా చూపిస్తే చాలదూ ? కొట్టాలా ?"

"పులివున్న అలాంటి యింట్లో మీ పనిమనిషి యెలా పనిచేస్తోందీ ?"

"ఆవిడమీద జాలివేసి పనిచేస్తోందట !"

"మీ పనిమనిషి ప్రతిరోజూ అక్కడ తిని యింటిక్కూడా తీసుకవెళ్తోంది. నేకళ్లారా రోజూ చూస్తున్నా. మనమాట సరిగ్గా యెందుకు వింటుందీ ?" శోభారాణి అంటే–

"పిల్లాజెల్లా ? విసిగెత్తి చెయ్యివదిలేస్తోంది. మనం కుటుంబాలతో అలా చేస్తే బైరాగుల్లో కలవాలి" ఇందుమతి అందుకుంది.

ఈ రోజు హాలునిండిన భక్తులు. గొంతుకలు సరిచేసుకుని మరీ వచ్చారు. చంక యెక్కిన పిల్లల్లా యీ రాత్రంతా చచ్చినా మేడ దిగకండా భజన చెయ్యాలని వచ్చారు. విద్యతో డబ్బు ఆర్జించు కున్నట్లే, భజనచేసి కోరికలు తీర్చుకుందామని వచ్చారు. భజన ప్రారంభించేసరికి తొమ్మిది దాటింది. పదిదాటేసరికి పైనించి ఏవో కేకలు. గిరిజానాధునకు యెవరో తొడ గిల్లినట్లు అనిపించింది. అందిన పూలను బాబాకు ఒక్కసారి రక్షించమని వేడుకోలుగా విసిరాడు. మొక్కినా పైనున్న దయ్యం నోరు కట్టలేదు. పోటీ పడినట్లు భజన సాగుతూంటే – నెత్తిపైనించి ఒకటే దంపు. వీళ్ల హార్మనీ, మృదంగాల దంపుకు మించిపోయిన దంపు. హమాం దస్తాలో కాఫీగింజలు, ఖారం మిరపకాయలో అదే పనిగా మీద దంపుతున్నారు. ఆ దడదడ శబ్దం బాంబులుపడ్డ శబ్దంగా మారగానే ఒక్కసారి అందరి కోపాలూ ఆకాశానికి అంటుకునే మంటలైపోయాయి. అక్కడేవున్న ఇంటిగలాయన గుండెల్లో ఒకోపోటు గునపం పోటులా గుచ్చుకోగానే గబగబా బయటకు వచ్చాడు. భజన ఆగిపోయింది. అండగా అతనితోపాటు మిగతా వారుపైకి యెగబ్రాకారు. తలుపుతట్టారు.

సిగరెట్ కాల్చుకుంటూ తలుపుతీసిన ఇంజనీరుని చూసి ఇందుమతి విలాసుడు కోపం పట్టలేక –

"నా యిల్లు తెల్లారేసకి ఖాలీ చేసీ !"

"ఏం ?"

"అలా దంచితే యిల్లేం అవుతుంది ?"

"ముందు ఆ కిందనించి వచ్చే దంపును ఆపవయ్యా !"

"అది దంపా ? భక్తీ ముక్తీ వద్దా ?" గిరిజానాధుడు అందుకున్నాడు.

"ఈ భజన న్యూసెన్సు ఆపండి" అన్నాడు యింజనీరు.

అందరికీ కోపాలొచ్చాయి. వీడి న్యూసెన్సు లేకండా చేస్తామని వెళ్లారు. ఆ వేళనించీ ఆ మేడలో నున్న మిగతా అందరికీ వీడు.

"యముడు. వీడికున్న నల్లని యెంబాసిడర్ కారు దున్నపోతు."

తెల్లారేసరికి కాంపౌండ్‌లో నున్న ఆ కారు టైర్లు బల్లపరుపుగా పడుకున్నాయ్. డ్రైవరు పైకివచ్చి చెప్పాడు. గాలి కొట్టించు అన్నాడు యి ం జ నీ రు. మరుచటి రోజు తెల్లారేసరికి సూర్యకుమారి, ఇందుమతి కార్లటైర్లు ఫ్లాట్ అయ్యాయి. గాలికొట్టినా ఫ్లాట్ అవుతున్నాయ్. పంచర్లు వేస్తేగానీ కార్లు కదల్లేదు. ఇంటి యాజమాని కోపంతో నీరు బంద్ చేసాడు. పైన




# NATIONAL-35 Sprinty BC మరియు Sprinty C కెమేరాలు

* చక్కదనం, హుందాతనం తగిన పాళ్ళలో కలిగి ఆధునికంగా అలంకరించబడింది.
* కెమేరా తయారీలో అత్యాధునికంగా ఉన్నతి చెందిన పద్ధతి ప్రకారంగా తగిన పైభాగం, తేలికైన ఇతర భాగాలూ వాటకాని ముంటం.
* లోతైన లోకావతో ఎఫ్/2.8 ఎరుపు రిజల్యూషన్ లెన్స్, చురుకైన చిత్రాలు తీస్తుంది.
* తీవ్రవేగంగం షట్టర్ మృదువైన కదలికవల్ల తప్పుడు వ్యవధి తీసుకుంటోంది. నేషనల్ క్విక్ లోడింగ్ పద్ధతి (క్యూ. ఎల్) ద్వారా ఆటోమేటిక్ ఫిల్మ్ లోడింగ్ జరుగుతోంది.
* ఫ్లాష్ కూడా ఏర్పాటు చెయ్యబడింది ఇది ఇంకా ఎక్కడైనా ఏ సమయంలోనైనా ఫోటోలు తియ్యడానికి సహాయపడుతుంది. ఇంకా ఈ ప్రత్యేక సదుపాయాలు కూడా గుర్తుంచుకోండి.

ప్రొవిజన్ ఫర్ ఎక్స్పోజర్ మీటర్ లేదు



SPRINTY BC



SPRINTY C



నేషనల్ ఇంస్ట్రుమెంట్స్ లిమిటెడ్
(భారత ప్రభుత్వ ఆధ్వర్యంలో)
జాదవ్‌పూర్; కలకత్తా 700032

NATIONAL-35 SPRINTY కెమేరాలు ఆరంభకులకు పరిపూర్ణతకే

# ప్రకృతి కానుక ప్రతి ఒక్కరికి. కోమల,యవ్వన ఛాయ సర్వాంగాలకి

పోర్చుగీస్‌లో వేప పేరు మార్గోసా. వివిధ రూపాల్లో వేప దేహానికి, చర్మానికి చేసే విశేషమైన మేలుకు తిరుగులేదు. అందుకనే తరతరాలుగా వేప అన్న అంత ఆదరణ.

మార్గో సబ్బు ఒక్కటిలోనే అధిక భాగం వేపనూనె వుంది. శుద్ధమైన, సహజసిద్ధమైన మార్గో సబ్బు శరీరాన్ని పరిశుభ్రంగా నుంచి అంగాలన్నిటి చర్మాన్ని సంరక్షిస్తుంది.

ప్రకృతికి తరలండి. మార్గోతో స్నానం చెయ్యండి. మీరు ప్రతిసారి స్నానం చేసేక మీ శరీరమంతా పరిశుభ్రంగా, తాజాగా, మెరుస్తూ వుంటుంది.

**శరీరమంతా పరిశుభ్రం**

**తల్లిలా చేసే సంరక్షణ**



ఓంకున్న డాబా తలుపులకు తాళం వేసాడు. ఇంజనీరు తాళాలు విరగ్గొట్టి పైపు విప్పాడు. వారంరోజుల్లో తగువులు పెరిగాయిగానీ తరగలేదు. ఈ వారంరోజుల్లో సూర్యకుమారి పనిమనిషికి వుద్వాసన చెప్పింది. శశికళ యింట్లో పని మాన మంటే మాననని అందట!

మళ్ళీ గురువారం. ఈసారి ఒకావిడ భక్తి మార్గం గురించి వుపన్యాసం ఇవ్వడానికి వస్తుంది. యముడు వచ్చేసరికి భజన, ఉపన్యాసం రెండూ ముగించాలని సంకల్పం.

"ఈ వేళ యెక్కడా చావుల్లేవేమో ? ఆరు గంటలకే ఆ యముడు వూడిపడ్డాడు" అంది గిరిజాదేవి అక్కసుతో.

"ఈ వచ్చినావిడ బాబా భక్తురాలేనా ?" అని భర్త నడిగితే —

"మంచి గొంతుక — మేధావి."

"సూర్యకుమారి లాంటి మేధావి కాదుకదా?"

"ఏం ?"

"వయసులో బాగా తిరగబట్టి, జుత్తు కాస్త నెరసాక భక్తి మార్గంలో దిగిందంటోంది."

"ఎవరెలాపోతే మనకెందుకూ ? అంతా బాబా చిత్తం. మన భాగ్యం."

ఆ వచ్చిన ఆవిడ భక్తి ప్రవచనాలు పలుకు తుండగా చేతిలో పళ్లెరం నిండా ఆపిల్ పండ్లతో శశికళ వచ్చింది.

"నువ్వుగాని పిల్చావా కొంపతీసి ?" అన్నట్లు గిరిజానాధుడు భార్యవేపు చూసాడు. 'నేను పిలవ లేదన్నట్లు' ఆవిడ సైగజేసింది.

"ఏదో గూడుపుఠాణీ జరుగుతుంది. కాస్త జాగ్రత్తగా చూస్తుండు" గొణిగాడు పెళ్ళాం చెవిలో.

శశికళ అలా కూర్చుంటే యీ ఆడవాళ్ల దృష్టి ఆవిడమీదనేగనీ చక్కని గొంతుతో శ్లోకాలు వల్లిస్తూ, విశ్లేషిస్తున్న భక్తురాలిపై కాదు. ఇది గమనించిందేమో ఆవిడ ఉపన్యాసం వేగిరం ముగించింది. తరవాత ప్రసాదం గిరిజాదేవి పంచి పెడ్తుంటే శశికళ తీసుకోలేదు.

"బాబా ప్రసాదం వద్దంటున్నావా ? తీసుకో-తీసుకో — నీ కడుపు పండుతుంది."

"నా కడుపు పండలేదని యెవరన్నారు ?"

# భ జ న

"పుట్టి పోయారేమో ?"

"నాకు కలిగిందొక్కడు. మా అత్తగారు అభిమానంతో బొంబాయిలో చదివించుకుంటున్నారు."

"పోనీ నీ కష్టాలు పోతాయి. ప్రసాదం పుచ్చుకో."

"నేను కష్టాల్లో చిక్కుకున్నానని ఎవరన్నారు?"

"నువ్వు తినకపోతే ఆయన కివ్వు. కోపం తగ్గి నిన్నూ, మా అందరినీ బాధపెట్టడు."

"అతను యెవరినీ అనవసరంగా బాధపెట్టరు."

"అన్నీ అబద్ధాలు — అబద్ధాలు ..." గిరిజాదేవే కాదు — సూర్యకుమారి, ఇందుమతి, శోభారాణి—వాళ్లతోపాటు వాళ్లభర్తలు ఏక కంఠంతో అరిచారు. వెకిలిగా నవ్వి యీసడించారు. శశికళ చప్పున లేచినిల్చుని అంది —

"ఈ భవనంలో మిగతా యిల్లాళ్లకన్నా నేను సుఖంగా వున్నాను."

"ఆ మాట అనడానికి యెంత ధైర్యం — ఎంత ధైర్యం" అంటూ మిగతా నలుగురు ఆడవాళ్లు వెర్రిగా లేచిపోయారు.

"మీలో గుట్లన్నీ బయటపెట్టమంటారా ?"

"నీలా దాచుకోవలసిన గుట్లు మా కేమీలేవు."

"నన్ను చెప్పనివ్వండి. నా మీద కనికరం చూపిస్తున్న మేధావి — సూర్యకుమారి మొగుడిచేత వంట చెయ్యించడమే కాదు—అవసరమైతే అంట్లు కూడా తోమిస్తుంది ... బట్టలు కూడా వుతికి స్తుంది. అలసిన మొగాడు హాయిగా నిద్రపోతుంటే— వాడికి సత్తువలేదని విసుక్కుంటూ వెన్నెలవేపు చూస్తూ విరహం వెదజల్లుతుంది."

"అంతా కట్టుకథ" సూర్యకుమారి అరచింది.

"ఇంక మా పొరుగు శోభారాణి—పాపం! ఆ మొగుడు విజ్ఞాన వీధిలో విహరిస్తూనే — ఎలికలాగ ఆమె పాత ప్రణయాన్ని గొలుకుతూనే వుంటాడు."

"అంతా అబద్ధాలపుట్ట" శోభారాణి కేక వేసింది.

"ఈ పూజమ్మగారు. గిరిజాదేవి. భజన భక్తురాలు. పళ్ళెరం నిండా ఆపిల్ పళ్లు తెస్తే యీ భక్తులకు పంచకండా మొగుడికి తినిపించ డానికి దాచుకుని, మాకు అటుకుల్ల ప్రసాదం ఇస్తే యెవరిక్కావాలి ? అష్టవంకరలతో వున్న యీ అవతారాన్ని అసహ్యించుకున్న మొగుడు, వయసులో వున్న పనిమనిషిని మానభంగం చేసాడని తెలుసుకున్నా—"

"నీ నోరెలా వచ్చిందే ? బాబా నీ అబద్ధాల నాలిక కోసేస్తాడు" గిరిజాదేవి అరచింది.

"ఇక యింటి యిల్లాలు ఇందుమతీదేవి సంగతి అందరికీ తెలిసిందే! ఇంటిగుట్టు వీధిలోనే పెట్టింది. ఆ మొగుడికున్న తల్లిప్రేమను కూడా కత్తిరించిన ఆడది — ఆ మొగుడు యే డొంక తిరుగుడు తిరుగుతున్నాడో తెలుసుకోలేని అమాయకురాలు ... "

"అమాయకురాలనుకున్నాం. కట్టుకథలు అల్లుకొచ్చావే? ఉండు నీ పని పట్టిస్తాను" అంటూ సూర్యకుమారి కొట్టడానికి వచ్చినట్లు వస్తే ఆ చెయ్యి పట్టుకుని —

"నా గుట్లు తెలుసుకోడానికి నీ పనిమనిషిని నా యింట్లో పెట్టావ్. నా గుట్లు నీతో యేం చెప్పిందో నాకు తెలియదుగానీ... ఈ మీ గుట్లన్నీ యింకా యెన్నో నాకు తెలిసాయి. మా యింటికి మీ యిల్లెంత దూరమో — మీ యింటికీ మా యిల్లూ అంత దూరమే అని మరచిపోకండి."

"ఆ యముడి దగ్గర బానిస బ్రతుకు బ్రతుకుతూ యిలాగ మమ్మల్ని అనడానికి నీ నోరెలా వచ్చిందే ?" అని కళ్ళెర్రజేసిన సూర్యకుమారివేపు నవ్వుతూ చూస్తూ —

"మా ఆయనను మీరు యముడనండి. రావణాసురుడనండి. అతను అరుస్తారు. కాదనను. కోపంతో కళ్లెర్రజేస్తారు. ఒకోసారి కొట్టడానికి కూడా వస్తారు. అతను అరచినా, కొట్టినా, తిట్టినా భరిస్తాను. ఎందుకు ? అతని జీవితంలో ఆడదాన్ని నేనొక్కర్తినే. మీ యెవరివేపు అతను కళ్లెత్తి చూసారా చెప్పండి ? ఉదయంనించీ రాత్రి వరకూ — ఒక టైము లేదు ఆ ఉద్యోగానికి - ఎప్పుడూ నరాలు యెక్కుపెట్టించేపని. తలనొప్పి, విసుగు కలిగించే ఉద్యోగం. దానితో అతను యింటికి వచ్చేసరికి చాలా టెన్షన్‌తో వస్తారు. ఆ ఉద్రిక్తత


మురళీమోహన్ సమర్పించు

కె.బాలచందర్



ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: N.S.మణి

లక్ష్మీ ఫిలింస్

LAKSHMI PUBS

తగ్గాలి అంటే అరవాలి, తిట్టాలి, కొట్టాలి. అలా తగ్గే అవకాశం అర్ధాంగినైన నేను యివ్వకపోతే మీరంతా యిస్తారా? ఈ అపురూపమైన వ్యక్తి భార్యనై యీ మాత్రం భరించలేకపోతే నేను వుండి యెందుకు? భరిస్తున్నానన్న తలపే నాకెంతో గర్వాన్ని యిస్తోంది. మీ కనికరం నాకు అక్కర్లేదు. దాని అవసరం వున్న మీ సహచరులకు చూపించండి." అంటూ శశికళ వెళ్లిపోయింది.

నిశ్శబ్దం. చివరకు భక్తి సందేశం యివ్వడానికి వచ్చిన ఆవిడ లేచి అన్నది—

"అలవరచుకున్న శీలంబట్టి బ్రతుకుతుంటాం. యిలాంటి భజనలప్పుడు కలుసుకుని యెదుటివారి ప్రవర్తనను తెలుసుకుని మన ప్రవర్తనను మెరుగు పరచుకుంటాం. మనం అందరం చూసే కోణం నించి కాక యింకో కోణం నించి ఒక వ్యక్తిని చూసిన యీ యిల్లాలి చివరి మాటలు ఒక్కసారి మీరు నెమరువేసుకుంటే - యీ భజన ఫలితం దక్కినట్లే లెక్క."




# గొప్ప అవకాశం!

ప్రతి 1000 గ్రాం ప్యాకెట్ పై

ఉచితం! మైసూర్ శాండల్ సబ్బు






స్టాక్ ఉండేవరకు ఈ ఇనాము లభించును

ఈ ఇనాము రహితకూడా పాయింట్ దొరకును.

పాయింట్
అతి నాణ్యమైన
డిటర్జెంట్ ఉతికే పౌడర్

MCA-PDP-64-TEL

కర్నాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగళూరు వారి నాణ్యమైన ఉత్పాదన.

మార్కెట్ చేయువారు: మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగళూరు.



'టాక్సీడ్రైవర్'లో ఒక దృశ్యం

[43 వ పేజీ తరువాయి]

## కట్టా సుబ్బారావు దర్శకత్వంలో ఎం. రామకృష్ణారెడ్డి సమర్పించే చిత్రం

"ఏప్రిల్ 24 నుండి మే 5 వరకూ రెండవ షెడ్యూల్ జరుగుతుంది," అన్నారు కట్టా సుబ్బారావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎం. శ్యామలారెడ్డి నిర్మించే సుమన్ క్రియేషన్స్ తొలి చిత్రం ఉగాదినాడు ప్రారంభమైంది. శోభన్‌బాబు, శారద, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, అల్లు రామలింగయ్య, పి.ఎల్. నారాయణ, గీత, జయమాలిని నటిస్తున్నారు. గొల్లపూడి, చక్రవర్తి, వెంగయ్య, భాస్కరరాజా, నరసింహారావు ప్రభృత సాంకేతికవర్గం.

## విశ్వప్రశాంత్ మూవీస్

కృష్ణ, శివాజీగణేశన్, శ్రీదేవి, అల్లు రామలింగయ్య, నాగేష్ ప్రభృతులతో కె. బాపయ్య దర్శకత్వంలో అడుసుమిల్లి లక్ష్మీకుమార్ నిర్మించే చిత్రానికి భమిడిపాటి రాధాకృష్ణ కథ, మాటలు రాశారు. చక్రవర్తి సంగీత దర్శకుడు. వెంకట్ ఛాయాగ్రాహకుడు. ★

ఒక చిత్ర సన్నివేశాన్ని శ్రీదేవితో చిత్రీకరిస్తున్న దర్శకుడు శ్రీ దాసరి —(ఫోటో : శ్రీధర్)








# కాని మీరు వదిలించుకోవాల్సింది ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండు అయితే మీకు కావాల్సిన షాంపూ, క్లినిక్‌ని మించినదై ఉండాలి మరి







## క్లినిక్ స్పెషల్

క్లినిక్ మీ చుండుపై పనిచేసిందని, మీకు సరిగ్గా సరిపడిందని మాకు తెలుసు, అయితే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండుగల వారున్నారన్న సంగతి మాకు తెలుసు.

అందుకే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండును తొలగించేందుకు కొత్త సూత్రీకరణను ప్రవేశపెట్టాం. క్లినిక్‌ని మించినదది...దాని పేరు క్లినిక్ స్పెషల్. ఆ! ఇప్పుడు రెండు క్లినిక్ షాంపూలు ఉన్నాయి, మామూలు చుండుకు క్లినిక్...ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుకు క్లినిక్ స్పెషల్ ఇక ఈ రెండింటి కలయిక చుండు సమస్యలన్నింటికి నివారణే మరి.

హిందుస్తాన్ లివర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన. HLSC-5041 TI

రెండు దశాబ్దాలకు పైగా తన అమృత లేఖినితో
తెలుగు పాఠకులను ఉర్రూతలూగిస్తున్న ప్రఖ్యాత రచయిత్రి

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి

# హైందవి

14·5·81 విడుదల!

వెల రూ. 15 లు. విడుదలకు ముందే ఆర్డరిస్తే రూ. 14 లకే—
రూ. 10 లు M.O చేయండి. మిగతా రూ. 4 లకు V.P పోస్టులో పంపుతాము.



నవజ్యోతి పబ్లికేషన్స్ ఏలూరురోడ్ • విజయవాడ2
ఫోన్ 74005

ఊరగాయల కాలం వచ్చేసింది
ఊరగాయలన్నింటికి 'అగ్‌మార్క్'

**A.S బ్రాండ్ పప్పునూనె**
**మాన్షన్ బ్రాండ్ నువ్వులనూనె**
లనే వాడండి.





★ 70 సంవత్సరాలనుండి మహిళాలోకం విశ్వాసాన్ని చూరగొన్నది............
★ సంవత్సరం అంతా ఘుమఘుమ లాడుతూ ముక్కని మెత్తబడనీయకుండా ఊరగాయని రుచికరంగా వుంచుతుంది............
★ అన్నివంటలకు శ్రేష్ఠమైనది




తయారు చేయువారు:
అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట.

TWINKLE

(గత సంచిక తరువాయి)

9

సీరియల్

# ఇంద్రసింహాసనం

## సి. ఆనందారామం

యయాతికి ప్రేమపూర్వకంగా వీడ్కోలు చెప్పి, ఉద్యానవనంలోంచి తనకు ప్రత్యేకంగా కేటాయించిన గదిలోకి వచ్చింది శర్మిష్ఠ. అక్కడ మణిమయాసనంలో కూర్చొనిఉన్న ఇంద్రాణిని చూసి తడబడి, నిలిచిపోయి, నమస్కరించింది. అపూర్వానందంతో కళకళలాడుతున్న ఆముగ్ధ సౌందర్యాన్ని చూసి లోలోన నిట్టూర్పు విడిచింది ఇంద్రాణి. తాను చెప్పబోయే విషయం విన్నాక పాపం, ఈ పసిపిల్ల ముఖం ఎలాఉంటుందో ?

"సుఖీభవ! శీఘ్రమే కల్యాణప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించింది. ఆ ఆశీస్సుకు శర్మిష్ఠ ముఖం ఆకాశగంగలోని స్వర్ణకమలమే అయింది.

"కూర్చో! నీతోకొంచెం మాట్లాడాలి?"

భయం భయంగా ముడుచుకుపోయి కూచుంది.

"శర్మిష్ఠా! నువ్వు చాలా అమాయకురాలివి. కొన్నిపరిస్థితులు అర్థంచేసుకోవాలి!"

భయుంగాచూసింది శర్మిష్ఠ.

"రాజపుత్రివి — నీ ధైర్యసాహసాలను చూపించే సమయం వచ్చింది. ఇప్పుడు నా ప్రశ్నలకు సమాధానంచెప్పు. యయాతి నిన్ను వివాహం చేసుకుంటానని అన్నాడా ?"

"దేవదానవ యుద్ధం ముగిసినతరువాత!"

"అంటే, మీ తండ్రి చంపబడ్డ తరువాత ? !"

శర్మిష్ఠ నిలువునా వణికింది.

"అలా భయపడకు — నిజాన్ని ధైర్యంగా ఎదుర్కో! మీ తండ్రి నిన్ను ఇక్కడకు పంపింది ఏ ఉద్దేశంతో ? మీ జాతిని రక్షించమని! కానీ, నువ్వు కన్నతండ్రి వధకే మార్గంవేస్తున్నావు. ఇదేనా నీ దేశభక్తి ? నీ జాతిపై నీకున్న మమకారం ఇదేనా ?"

బిత్తరపోయింది శర్మిష్ఠ.

"కానీ నా తండ్రి తానే ఇంద్రుడుకావాలని ప్రయత్నిస్తున్నాడు. అంటే, యయాతినీ, అతడి తండ్రినీ వధించి ..." వాక్యం పూర్తి చెయ్యలేకపోయింది.

"పిచ్చిపిల్లా! ఇంద్రుడు కావటం అంత తేలిక కాదు. శక్తి సామర్థ్యాలు మాత్రమేకాక ప్రజల ఆమోదం కూడా ఉండాలి. అందుకే ఇదివరలో, శక్తిసామర్థ్యాలతో కొందరు రాక్షసరాజులు ఇంద్రపదవి సంపాదించినా జనామోదాన్ని పొందలేక దాన్ని నిలుపుకోలేకపోయారు. రాక్షస నిరంకుశత్వం జనం ఏనాడూ సహించరు. నిగ్రహమూ, సమదృష్టి, సంయమనమూ ఇవన్నీఉన్న దివ్యులు మాత్రమే లోకపాలనకు అర్హులు. ఇంతకూ నీ కర్తవ్యం నిర్ణయించుకున్నావా?"

"నేను యయాతిని వదిలి జీవించలేను."

లోలోపల నవ్వుకుంది ఇంద్రాణి —

"అదే నిజమయితే, ఇప్పుడు నువ్వు అవలంబిస్తున్నది సరిఅయిన మార్గం కాదు.. దేవతలే జయిస్తే నహుషుడు ఒక్కనాటికి నిన్ను కోడలిగా అంగీకరించడు. యయాతి తండ్రిని ఎదిరించగలడేమోకాని, ఇంద్రపదవిలో ఉన్నవాడిని ఎదిరించటానికి వీల్లేదు. దానవులే జయిస్తే, యయాతినికాని, నహుషుణ్ని కానీ ప్రాణాలతో వదలరు."

"అమ్మా!" ఇంద్రాణి పాదాలమీద పడింది శర్మిష్ఠ.

ఆమెను లేవనెత్తింది ఇంద్రాణి.

"శర్మిష్ఠా! నామీద విశ్వాసముంచు — నావల్ల నీకు తాత్కాలికంగా ఆపదకలిగినట్లు తోస్తుంది. కానీ, త్వరలోనే నీకు శుభమవుతుంది. అటు నీ తండ్రికి కానీ, ఇటు యయాతికి కాని ఏ ఆపదా రాదు."

"అమ్మా! మీరు చెప్పినట్లు వింటాను. నాకు తల్లీ, తండ్రీ, దైవమూ, అన్నీమీరే! నా ధైర్య పరాక్రమాలనుగూర్చి సందేహించకండి. నేనూ సుశిక్షితురాలినైన రాకుమారినే!"

"విశ్రాంతి తీసుకో!"

శర్మిష్ఠను వదిలి తనఅభ్యంతరమందిరంలోకి వచ్చింది. అక్కడ దేవకన్యలు ఆమె కోసం కాచుకొని ఉన్నారు. ఆమె రాగానే నమస్కరించి "అమ్మా! జయంత కుమారులు యమలోకంలో యముడి నిర్బంధంలో ఉన్నా దేనికీ లోటు లేకుండా, సర్వసౌఖ్యాలతో ఉన్నారు. యముడికి తమపట్ల ఉన్న గౌరవం తమకు తెలియనిది కాదుగదా? విచారణ జరగబోతోంది — ధర్మశాస్త్రాలన్నీ శోధిస్తున్నాడు యముడు. ఎలాగైనా జయంత కుమారులను శిక్షనుండి తప్పించాలనే ప్రయత్నిస్తున్నాడు."

అంతా విని కొద్దిసేపు మాట్లాడకుండా కూర్చుంది ఇంద్రాణి. తరువాత దేవకన్యలను చూసి "మీరు అగ్నిలోకానికి వెళ్ళి, అగ్ని! యయాతి శర్మిష్ఠతో నందనోద్యానంలో

---

జరిగినకథ — 4 : వృషపర్వపురానికి చెందిన రాక్షసరాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ అందం, తెలివితేటలు, ధైర్య సాహసాలు కల రాకుమారి. ఆమె, మానవ రాకుమారుడు యయాతి ఇరువురూ ఒకరినివిడిచి ఒకరు వుండలేనంత గాఢంగా ప్రేమించుకొంటారు. యయాతిని కలుసుకొని తమ నగరంపై దేవతల దండయాత్ర ఆపించమని శర్మిష్ఠను వృషపర్వుడు ఆజ్ఞాపిస్తాడు. తమ అనుబంధానికీ, రాజకీయాలకూ తండ్రి ముడిపెట్టడం ఇష్టంలేకపోయినా యయాతిని కలుసుకోవచ్చుననేభావం ఆమెకు ఆనందం కల్గిస్తుంది. ఇంద్రుడు చేసిన ఘోరాలను సహించలేక సప్తఋషులు అతన్ని పదవీచ్యుతుని గావించి, ఆ స్థానంలో యయాతి తండ్రి నహుషుడ్ని నియమిస్తారు. ఆతన్ని ఎలాగయినా దింపేసి మళ్ళీ ఇంద్రుడ్ని ఆ స్థానంలో నిలబెట్టాలని ఇంద్రాణి శచీదేవి ఆలోచిస్తూంటుంది. ఆమెకు నారదుడు సహాయపడతాడు. అతడు నహుషుణ్ని రెచ్చగొట్టి అగ్ని, వాయు, వరుణ, నిర్ఋతులలో పరస్పర కలహాలూ, అధికార దాహమూ రగిలేటట్లు ప్రవర్తిస్తాడు. యయాతీ, శర్మిష్ఠలను ఒకటిగా చేస్తుంది ఇంద్రాణి. మహేంద్రుని ఆజ్ఞను ధిక్కరించాడనే నెపంతో జయంతుని యమలోకానికి పంపిస్తాడు నహుషుడు.

---




వివాహం చేస్తున్నట్టు తెలియజేసి రండి" అంది.

"చిత్తం" అని వెళ్ళిపోయారు ఆ కన్యలు.

ఇంద్రాణి తీవ్రాలోచనలో నిమగ్నురాలయింది. అటు శర్మిష్ఠ, ఇటు మేనక యిద్దరు అమాయక స్త్రీల రక్షణ భారం తనమీద వుంది. ఆ ఇద్దరిలో ప్రతి ఒక్కరి రక్షణా కత్తిమీద సాము లాంటిదే! శత్రువుల పంజాలోంచి అతి నేర్పుతో తప్పించాలి! ఏమిటో, ఈ రా జ కీ యా లు! పురుషుల సంకుచిత స్వార్థ రాజకీయాలకు స్త్రీలు బలి అయిపోతున్నారు! ఎవరిదాకానో ఎందుకు? తన కన్న కూతురు జయంతి కూడా ఇలాగే నాశనమయిపోయింది. బృహస్పతి దగ్గిర చదువుకొనే రోజుల్లోనే శుక్రుడు జయంతిని ప్రేమించాడు. కానీ, ఇంద్రుడు జయంతిని శుక్రుడుకిచ్చి వివాహం చెయ్యటానికి యిష్టపడలేదు. కానీ, శుక్రుడు తన స్వశక్తితో విద్యలన్నీ సాధించి రాక్షసులకు గురువై, ఇంకా అద్భుత దివ్య శక్తులు సాధించాలని తపసు చేస్తున్నప్పుడు, అతడి తపసు భగ్నం చేయటానికి జయంతిని పంపాడు. శుక్రుడు మహా నిగ్రహశాలి. అందుకే అంతటి దివ్య శక్తులు సాధించగలిగాడు. శుక్రుడు మృతసంజీవని సాధించేవరకూ, జయంతి అతడి తపసు భగ్నం చెయ్యలేక పోయింది. ఆ తరువాత జయంతిని అప్పటికీ మరచిపోలేని శుక్రుడు ఆమెతో కొంత కాలం గడిపాడు. వారికి దేవయాని జన్మించింది. రాక్షసులకు గురువుగా ఉన్న శుక్రుడు ఇంద్రపుత్రిని తన భార్యగా స్వీకరించలేకపోయాడు. దేవయానిని మాత్రం తనతో తీసికెళ్ళి పోయాడు. అందుకే దేవయాని అంటే, అతనికి పంచప్రాణాలు.

జయంతి అనుభవించిన దారుణ దుఃఖం ఇప్పటికీ ఇంద్రాణి మనసును కోస్తూనే వుంటుంది. ఈ అవమానాలన్నీ సహిస్తూ స్త్రీలు అబలలుగా వుండిపోవలసిందేనా? అలా జరగటానికి వీల్లేదు. తను ఎదుర్కొంటుంది, ఈ స్వార్థకీటకాలను! స్త్రీ శక్తి ఎంతటిదో నిరూపిస్తుంది.

దేవభటులను పిలిపించి ఉచ్చైశ్రవాన్ని తెప్పించింది. అది అత్యుత్తమ జాతి అశ్వం. దాని వేగాన్ని అలవాటు పడినవారు తప్ప మరెవ్వరూ అందుకోలేరు. శర్మిష్ఠను పిలిపించి, "ఈ అశ్వంమీద ప్రయాణం చెయ్యగలవా?" అని అడిగింది శర్మిష్ఠ కుతూహలంతో "తమ ఆజ్ఞ!" అంది. అశ్వంమీద మల్లెలు పొదిగిన జీను వేయించి, కళ్ళెం తగిలించి, "అశ్వరాజా! ఈ శర్మిష్ఠ నాకు పుత్రిక లాంటిది. ఈమెను సురక్షితంగా గమ్యం చేర్చాలి, ఏ సమయంలోనైనా సరే!" అంది ఆ అశ్వం చెవిలో. విని అర్థం చేసుకొన్నట్టు తల ఊపింది ఆ దివ్యాశ్వం. శర్మిష్ఠ ఆ అశ్వంమీద కూచోగానే, అది వాయువేగంతో పరుగుతీసింది. అది కొద్ది సేపట్లో ముల్లోకాలూ చుట్టి వచ్చింది.

"భళీ! శర్మిష్ఠా! భళీ! ఈ ధైర్య సాహసాలు ఇలాగే నిలుపుకో! సమయం వచ్చినపుడు నేను ఆజ్ఞాపించగానే వెనుక ముందు లాలోచించక ఈ అశ్వంమీద పారిపోవటానికి సిద్ధంగా వుండు."

## ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు

# 1981, ఏప్రిల్ 14 నుండి 18 వరకు కౌలాలంపూర్ మలేషియాలో



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

# మా తెలుగుతల్లికి మల్లె పూదండ



డా. దాతో సేరి మహతీర్ మహమెద్
తాత్కాలిక ప్రధానమంత్రి (మలేషియా)

1981 ఏప్రిల్ 14 తెలుగు జాతి చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయదగిన రోజు. ప్రతి తెలుగు వ్యక్తి గర్వించదగిన రోజు. ప్రాచీన వైభవంతో సుసంపన్నమైన తెలుగుసంస్కృతీ సాంప్రదాయాలు ప్రపంచం నలుదిశలా వెలుగులను విరజిమ్ముతూ తెలుగు ప్రజల కీర్తి బావుటాను ఎగురవేస్తున్నాయి. దేశ భాషలందు తెలుగు లెస్స అన్న సూక్తిని ఋజువు చేస్తున్నాయి.

ధైర్యసాహసాలను పుణికి పుచ్చుకున్న తెలుగుప్రజలు అలనాడు సాహసంతో సముద్రాలు జయించారు. విదేశాల్లో తమ ప్రజ్ఞా ప్రాభవాలను విజ్ఞానచంద్రికలను వెదజల్లారు. తెలుగుతల్లి యశస్సును ఇనుమడింప జేశారు. ఇది తెలుగుజాతికి అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ గర్వకారణము. అలనాటి శాతవాహన రాజుల, కాకతీయ చక్రవర్తుల, విజయనగర ప్రభువుల వైభవం పునరావృత్తమైనంత సంరంభంతో 1975లో ప్రథమ ప్రపంచ తెలుగుమహాసభలు హైదరాబాదు నగరంలో జరిగాయి. దేశ విదేశాల్లోని తెలుగు ప్రజల ప్రతినిధులు చాలామంది ఆ మహాసభల్లో పాల్గొన్నారు. మళ్లీ ఆరేళ్లతర్వాత నేడు తెలుగు దుందుభి మరోసారి దిగంతాలవరకు మార్మోగుతున్నది. ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలతో స్ఫూర్తిని, ఉత్తేజాన్ని పొందిన విదేశాల్లోని తెలుగు ప్రజలు తమ సంస్కృతీ పునరుజ్జీవనానికి పాటుపడుతూ విదేశాల్లో సైతం ప్రపంచ తెలుగు మహాసభలు జరుపుకోడానికి ఎంతో ఉత్సాహంతో ముందుకు రావడం ప్రతి తెలుగు పౌరునికి ఆనందం కలిగిస్తున్నది.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

మన రాష్ట్రం నుంచి లోక్‌సభకు ప్రాతినిధ్యం వహిస్తున్న మన ప్రియతమ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి ఆశీస్సులు ఈ రెండవ ప్రపంచ తెలుగు మహాసభలకు లభించడం మనఅదృష్టం. తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం. జి. రామచంద్రన్, పాండిచేరి ముఖ్యమంత్రి శ్రీ డి. రామచంద్రన్ ఈ తెలుగు మహాసభలలో పాల్గొనడం భారతదేశ ప్రజల సహోదరభావానికి, భారత జాతి సమైక్యతకు చిహ్నం, మలేసియా తాత్కాలిక ప్రధానమంత్రి డా. దాతాసేరి మహతీర్ మొహమెద్ ఎంతో ఆసక్తితో ప్రత్యేక శ్రద్ధతో ఈ మహాసభకు హాజరుకావడం తెలుగు ప్రజలకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నది. విశ్వమంతా ఒకేకుటుంబం అనే సూక్తికి ఇది నిదర్శనం. కౌలాలంపూర్‌లో జరుగుతున్న రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు తెలుగు ప్రజల హృదయాలు మరింత ప్రగాఢంగా పెనవేసుకుపోవడానికి దోహదం చేస్తాయి.



శ్రీ బట్టం శ్రీరామమూర్తి,
సాంస్కృతిక వ్యవహారాలశాఖ

## తెలుగు జాతికి జేజేలు
## తెలుగు సంస్కృతికి జేజేలు

సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ D.I.P.R. No. 14256 Advt Cl-3-81

బాధారహిత ప్రకృతిసిద్ధమైన ఆరోగ్యము మీదే!
స్త్రీల బాధలు ప్రత్యేకమైనవి
లోధ్ర
75 సంవత్సరములకు పైగా
సుఖజీవనమునకు
లోధ్ర టానిక్‌ను
వాడిన స్త్రీలు ఎందరో!
ఉచిత వైద్య సలహాకు
ఈ క్రింద పేర్కొనబడిన విలాసమునకు
ఈ కూపన్‌ను పూర్తిచేసి మీ జాబుతో పంపండి.
పేరు, ____________
విలాసము: ____________
____________ PIN ____________



కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్ రాయపేట, మద్రాసు-14.
ఏజంట్లు: శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్ విజయవాడ — సికిందరాబాద్.

పళ్ల డాక్టరు చెబుతున్నారు
నియమానుసారంగా పళ్లను బ్రష్ చేసుకొని,
చిగుళ్లను మాలిష్ చేసుకోండి;
చిగుళ్ల బాధలు, దంతక్షయం అరికట్టుండి.
ఫోర్‌హాన్స్ డబుల్ యాక్షన్
టూత్‌బ్రష్ వాడండి
మీ పళ్లను శుభ్రపరచడంతోపాటు చిగుళ్లను మాలిష్
కూడా చేయడానికి ప్రత్యేకంగా రూపొందించబడింది


పళ్లను బ్రష్ చేసుకోవడానికి, చిగుళ్లను మాలిష్ చేసుకోవడానికి ఫోర్‌హాన్స్ పద్ధతి నేర్చుకోండి. «పళ్లు, చిగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ» అనే రంగుల పుస్తకం ఉచితంగా కావాలంటే పోస్టు ఖర్చుకోసం 30 పైసల స్టాంపు జతపరుస్తూ ఈ చిరునామాకు వ్రాయండి: ఫోర్‌హాన్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, డిపార్ట్‌మెంట్ నెం. B57–238, పోస్టు బేగ్ 11463, బొంబాయి 400 020. ఏ భాషలో కావాలో వ్రాయండి.
ఫోర్‌హాన్స్ టూత్ బ్రష్‌లు
ఇంటిల్లిపాది కోసం
అడల్ట్ (మీడియం మరియు సాఫ్ట్) * జూనియర్ * బేబీ
Regd. T.M: Geoffrey Manners & Co. Ltd. 238F-152 TEL

## ఇంద్రసింహాసనం

"పారిపోవటమా ?"

"శర్మిష్ఠా! నన్నేమీ అడగకు దేనికీ భయపడకు నామీద విశ్వాసముంచు నీకూ యయాతికీ, ఆపద రాకుండా నేను కాపాడు తాను. తప్పకుండా మీ రిద్దరూ ఒకటి అవుతారు. కానీ, కొంత ఆలస్యమూ, కొన్ని అవాంతరాలూ తప్పవు."

"తమ ఆజ్ఞ!" కన్నీరు నిగ్రహించు కొంటూ చేతులు జోడించింది శర్మిష్ఠ.

**10**

వాయుదేవుడూ, అగ్నిదేవుడూ అగ్ని లోకంలో రహస్యంగా సమావేశమయ్యారు. ఒకరిని అణగద్రొక్కి మరొకరు పైకి రావాలని ప్రయత్నిస్తూనే, నహుషుణ్ని దింపే ప్రయత్నంలో వారిద్దరూ ఒకటై పైకి స్నేహం ప్రకటించుకొంటున్నారు.

"భూలోక వాసులలో నహుషుడి పాలన పట్ల అసంతృప్తి ప్రబలింది. ఇంద్రాణి ప్రయత్నాలవల్ల తమని పీడిస్తున్నది నహుషుడే అనే నమ్మకం కలిగింది, చాల మందిలో" అన్నాడు అగ్ని.

"కేవలం సామాన్యులలో అసంతృప్తి చాలదు. కుబేరులంతా అతనికి అండగా వున్నారు. అంతేకాదు, మేధావులూ ఇంకా అతడినే సమర్థిస్తున్నారు."

"రాక్షసుల దండయాత్ర ఒకటి భయ పెడుతోంది. యయాతి పరాక్రమంమీద ప్రజలకు నమ్మకముంది."

"మనం కొంతమందిమి నహుషుడ్ని వ్యతిరేకిస్తే స్వర్గంలో అతడి బలగం తగ్గిపోదా ?"

"తొందరపడకు. ఎంతమంది అతణ్ని వ్యతిరేకిస్తారో తెలుసుకోకుండా మనం బయట పడకూడదు."

ఆ సమయంలో ఆంతరంగిక భటుడు "అగ్నిదేవా? మీ రహస్య గూఢచారులు ఏదో అత్యవసర సమాచారం తీసుకొచ్చారట! మీ అనుజ్ఞకోసం వేచి వున్నారు" అని చెప్పాడు.

"ప్రవేశపెట్టు" అన్నాడు అగ్నిదేవుడు.

ఎటుచూసినా సెగలు విరజిమ్ముతోన్న ఆ భవనంలోకి ప్రవేశించారు, అగ్ని భటులు. వారి ముఖాలలో కనిపించే సంభ్రమాన్నిబట్టి అదేదో చాలా ముఖ్యమైన వార్త అను కొన్నారు, అగ్ని వాయువులు.

"చెప్పండి ?" అని అగ్ని అనుజ్ఞ ఈయగానే వాళ్ళు చెప్పటం ప్రారంభించారు—

"దేవా ! ముగ్గురు దేవకన్యలు రహస్యంగా మాట్లాడుకొంటున్న మాటలు మేము వినగలిగాము. వాళ్ళ మాటలనుబట్టి, యయాతి రాక్షస రాజకుమారి శర్మిష్ఠను నందనోద్యానంలో కలుసుకొంటున్నట్లు తెలిసింది."

ఈ వార్త అగ్ని వాయువులలోనూ తీవ్ర సంచలనం కలిగించింది.

"యయాతి రాక్షస రాజకుమారిని కలుసుకొంటున్నాడా ? ఈ వార్త నిజమయితే మన పంట పండినట్లే ! యయాతిని వెంటనే బంధించి ఈ వార్త కార్చిచ్చులా ప్రచారం చెయ్యగలను."

"భటులను వెంట తీసుకొని, నిజానిజాలు తేల్చుకొందాం ! బయలుదేరండి."

ఇద్దరూ తగిన వీరభటులతో నందనోద్యాన పరిసరాలు సమీపించి రహస్యంగా దాగి వున్నారు. యయాతి ఉద్యానవనంలోకి వచ్చి ఎప్పటిలాగే సంకేతం పంపాడు. ఆ సంకేతం అందుకొని శర్మిష్ఠ వచ్చింది. వారిద్దరూ విహరిస్తుండగా అగ్ని వాయువులు తమ భటులతో అతనిమీద పడ్డారు. ఏంజరుగుతోందో యయాతికి తెలియలేదు. ఈ దాడికి అతడు సిద్ధంగాలేడు. ఇంద్రకుమారుడైన తనను ఎవరైనా ముట్టడించటానికి సాహసిస్తారని అతడు అనుమానించలేక పోయాడు. విభ్రాంతిలో మునిగివున్న శర్మిష్ఠను దేవకన్యలు ఉచ్చైశ్శ్రవంమీద కూచోబెట్టారు. శర్మిష్ఠ ఏదో మాట్లాడే లోగానే అశ్వాన్ని అదలించారు — అది పరుగు తీసింది.

యయాతిని ఇంద్రసభలో ప్రవేశపెట్టారు. తన కొడుకే దోషిగా ప్రవేశ పెట్టబడటం చూసి నహుషుడికి మతి పోయింది.

"ఇంద్రకుమారుడు శత్రురాజకుమారితో మంతనాలు సలుపుతున్నాడు. ఇదిక్షమించరాని లోక ద్రోహం." అని నేరం ఆరోపించారు అగ్ని వాయువులు.

"నేను ఏ ద్రోహమూ తలపెట్టలేదు. నేను శర్మిష్ఠను ప్రేమించాను" అని నిర్భయంగా ప్రకటించాడు యయాతి. ఈ మాటలతో అతడి నేరం మరొకరు రుజువు చెయ్యకుండానే రుజువయిపోయింది. నహుషుడు మహోద్రేకంతో "నువ్వు శర్మిష్ఠను ప్రేమించడానికి వీల్లేదు. శర్మిష్ఠను పిలిపించండి. ఇప్పుడే అప్సరసలలో కలిపేస్తాను. భూలోకంలోని నా మిత్ర రాజులకు కానుకగా పంపిస్తాను" అన్నాడు. యయాతి రెచ్చిపోయి "శర్మిష్ఠ జోలికి ఎవరు వచ్చినా హతమారుస్తాను" అనేసాడు. సభ అంతా నివ్వెరపోయింది. ఆ ధైర్యానికి నహుషుణ్ని వ్యతిరేకిస్తున్న వర్గంవారు చాలా ఆనందించారు. "యయాతి ఒకటికి రెండు నేరాలు చేసాడు. శత్రు రాజకుమారితో మంతనాలు జరిపాడు. ఇంద్రుణ్ని ధిక్కరించాడు" అన్నారు. నహుషుడు మాట్లాడలేక పోయాడు. మునులే "యయాతిని యమలోకంలో నిర్బధించి నేరం విచారించమని ఆజ్ఞాపించండి" అని నహుషుణ్ని హెచ్చరించారు. విధిలేక నహుషుడు తన భటులను యయాతిని నిర్బంధించి యమలోకంలో ఉంచమని ఆజ్ఞాపించాడు.

యమలోకంలో నిర్బంధంలో వున్న యయాతిని చూడటానికి వచ్చింది ఇంద్రాణి. అప్పటివరకూ ఆమె జయంతుణ్ణి చూడటానికి కూడా రాలేదు. యయాతి ఆమెకు నమస్కరించి "అమ్మా! శర్మిష్ఠ క్షేమంగా వుందా ?" అని అడిగాడు.

"నాకు తెలియదు బిడ్డా ! ఇప్పుడామె నా భవనంలోలేదు. తానే వెళ్ళిందో, ఎవరైనా అపహరించారో తెలియటంలేదు."

"అమ్మా ! మీరామెను కాపాడలేరా ?"

"స్వర్గంలో ఎక్కడవున్నా, కాపాడగలను— అప్పటివరకూ నేను క్షేమంగా వుంటే..."

"మీకు ఆపద కలిగించగలిగిన వారెవరు?"

"నీకు తెలియదా ?"

"దయచేసి చెప్పండి !"

"నీతో చెప్పటానికి నాకు లజ్జగావుంది. అయినా చెపుతాను — మీ తండ్రి నన్ను కోరి రాయబారాలు పంపుతున్నాడు."

"ఛీ !"

అసహ్యాన్ని భరించలేకపోతున్నాడు యయాతి ఏమిటీవ్యర్థం ? ఇదేనా ఇందుల ఔన్నత్యం ? తాను అక్రమంగా మరొకరి ఇల్లాలిని గౌరవనీయురాలిని నీచంగా కోరుతున్నాడు ! కొడుకు పవిత్ర ప్రేమను గర్హిస్తున్నాడు. అదిఒక నేరంగా నిర్బంధంలో వుంచాడు.

"జయంత కుమారుడు కూడా ఇక్కడే నిర్బంధంలో వున్నాడు తెలుసా ?"

"తెలుసు" ఆ మాటలంటుండగానే యయాతి ముఖం వెలవెలపోయింది. ఆనాడు జయంతకుమారుణ్ని నిర్బంధంలోకి తీసుకొంటున్నప్పుడు తాను తండ్రి చర్యను గర్హించలేదు. ఇప్పుడు తనదాకా వస్తేకాని, తనకు తండ్రి చర్యలో అల్పత్వం అర్థంకాలేదు. అదే సున్నితంగా ఎత్తిపొడుస్తోంది. చిరునవ్వుతో వెళ్ళిపోయింది ఇంద్రాణి. ఇదంతా ఈమె పన్నాగం కాదుకదా, అనే ఆలోచన మొదటిసారిగా వచ్చింది యయాతికి. తనకుమారుణ్ని అక్రమంగా కేవలం కక్షతో నిర్బంధించినందుకు మెత్తని చెప్పుతో కొట్టినట్లు ఎంత బాగా బుద్ధి చెప్పింది ? మరి, శర్మిష్ఠ గతి? శర్మిష్ఠకు ఇంద్రాణివల్ల ఇప్పటికే ఏ ఆపదా



సినిమాతారలు

శ్రీదేవి, సుజాత, జయసుధ, జయప్రద ల ఫొటోల సెట్టు 5 రూ. ఏ. యన్. ఆర్. ఎన్. టి. ఆర్. శోభన్ బాబు, కృష్ణ, కృష్ణంరాజు ల ఫొటోల సెట్టు 6 రూ. నాటి గాయకుడు ఘంటసాల, నేటి గాయకుడు S. P. బాలసుబ్రహ్మణ్యం ఫొటోల సెట్టు 4 రూ. సినీతారల అడ్రసుల పుస్తకం 2 రూ. ఈ క్రింది అడ్రసుకు ఎం. ఓ. చేసిన వారికి పంపబడును.

వై. కె. మూర్తి

దాసరివారి వీధి - విజయవాడ-2.



దేహపుష్టికి ఆరోగ్యానికి

పండిత - డి. గోపాలాచార్యులవారి

జీవామృతం

1898 నుండి ప్రసిద్ధి గాంచినది

ఆయుర్వేదాశ్రమం

(ప్రైవేట్) లిమిటెడ్

మదరాసు-17.



వరముల బలహీనత, గుప్తరోగములకు

ఉత్తమ చికిత్స!



పెండ్లికి ముందు, పెండ్లి తర్వాత సంప్రదించండి.

Dr. Z. H. ROY (Govt Regd)

Dr. K. Kesava Rao, (GovtRegd)

ఆసియా క్లినిక్

ఆర్. టి. సి. క్రాస్‌రోడ్

సంధ్య టాకీస్ ఎదుట,

హైదరాబాద్ – 500020.

కృష్ణా టాకీస్ వద్ద, కడప-1.



మెడికల్ ఇంజనీరింగ్ ఎంట్రన్స్

పరీక్షల శిక్షణ

సీట్లకు ముందుగా రిజర్వు చేసుకోవచ్చు! హాస్టలు వసతి కూడా కలదు. ఏప్రియల్ చివరి వరకు గడువు. వివరాలకు వెంటనే ఒక కార్డు వ్రాయండి.

శాంతా కాలేజి

బ్రాడీపేట — గుంటూరు,

పి. శ్రీమన్నారాయణ, ప్రిన్సిపాల్.



FOR

PHILIPS

TRANSISTORS • RADIOS

RECORD PLAYERS • STEREOS

RHYTHM CENTRE

OPP. TAJMAHAL HOTEL

ABID ROAD HYDERABAD

PHONE: 37257

B.A.P


## ఇంద్ర సింహాసనం

రాదు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆమె అంత నీచంగా ప్రవర్తించదు. అదీగాక ఆమె ఆశీస్సు అమోఘం. ఏనాటికయినా తాను శర్మిష్ఠను తప్పక కలుసుకోగలడు.

యయాతిని బంధింపవలసి వచ్చినందుకు పరితపిస్తూన్న నహుషుడి దగ్గరకు వచ్చాడు నారదుడు.

"రండి! రండి! మీరు తప్ప నన్నెవరూ గట్టెక్కించలేరు. నేను నా కుమారుడు యయాతినే..."

"విన్నాను. విని నీకు సహాయం చేద్దామని వచ్చాను. యయాతి నిర్బంధించబడ్డాడే కాని, శిక్షించబడలేదుగా!"

"కాని, అతడి నేరానికి శిక్ష నిశ్చయం!"

"శిక్ష విధించేదెవరు? యమధర్మరాజా! అతడెవరు? నీ క్రింది ఉద్యోగి!"

"అవుననుకోండి! కానీ అతడి విధి అతడు చెయ్యాలిగా?"

"ఏది విధి. నువ్వు శాసించిందే విధి. ఈ స్వర్గంలో నీ మాట కెదురేది? నిన్ను కాదనగలవారెవరు? నువ్వే సర్వాధికారివి."

"అయితే!..."

"ఇంకా ఆలోచన దేనికి? వెంటనే యముడిని రావించు, యయాతిని నిర్దోషిగా నిర్ణయించమని చెప్పు."

"బాగుంది! నమస్కారం స్వామీ! ఇప్పుడే యముణ్ని రావిస్తాను." నహుషుడు సంభ్రమంగా లేచాడు, అంతరంగిక పరివారకుణ్ని పిలవటానికి. నారదుడు నవ్వుకొని వెళ్లిపోయాడు.

నహుషుడి ఆజ్ఞ అందుకొని యముడు వచ్చాడు. ఎన్నడూ లేంది నహుషుడు తన ఏకాంత మందిరానికి ఆహ్వానించటం యముడికి కొంచెం ఆశ్చర్యం కలిగించింది. తాను కూచొని యముణ్నికూడా కూచోమన్నాడు నహుషుడు.

"యమధర్మరాజా! నీ సహకారం కోరుతున్నాము."

"ఆజ్ఞాపించండి!"

"యయాతిని నిర్దోషిగా నిర్ణయించాలి!"

"అది నేనేలా చెయ్యగలను? నా సభలో ధర్మశాస్త్రజ్ఞులు అనేకమంది వున్నారు. వారి నిర్ణయాన్ని అనుసరించవలసినవాడనే నేను."

"కానీ, తుది నిర్ణయం నీదేకదా!"